# హానోయి విశేషాలు

# కాంబోడియా కబుర్లు

క్రొవ్విడి లక్ష్మన్న. ఎం.ఎ.బి.ఎల్.



# హానోయ్ విశేషాలు
# కాంబోడియా కబుర్లు

రచన:
క్రొవ్విడి లక్ష్మన్న

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పరిచయం

ఈ గ్రంథ రచయిత శ్రీ క్రొవ్విడి లక్ష్మన్నగారు జనీవా ఒప్పందం ప్రకారం, ఇండో చైనాలో పనిచేయడానికి వెళ్ళారు. వెళ్ళి ఇండో-చైనా దేశచరిత్రను, సంస్కృతిని, ప్రజల జీవన విధానాలను పరిశీలించారు. తమ అనుభవాలను చక్కని వ్యాస మాల రూపంలో వెలువరించారు. భారత సంస్కృతీ ప్రభావం అక్కడి జీవితంలోని వివిధరంగాల్లో ఏ విధంగా ప్రతిఫలిస్తున్నదీ వివరించారు. ఇంతేగాదు, ఇండోచైనా ప్రజల ఆశలు, ఆశ యాలూ ఆకళించుకొని వాటి సాధనకోసం వారు సల్పుతున్న పోరాటాన్ని సానుభూతితో అర్థంచేసుకోడానికి ప్రయత్నించి, సహృదయతతో ఆశీర్వదించారు.

ఈ గ్రంథాన్ని ప్రచురించే అవకాశం మాకు కల్పించిన శ్రీ క్రొవ్విడి లక్ష్మన్నగారికి కృతజ్ఞత తెలియజేస్తున్నాము.

ఆదరించవలసిందిగా ఆంధ్ర మహాజనులను అర్థిస్తున్నాము.

విజయవాడ,
20—3—'57.

—ప్రచురణకర్తలు.



జెనీవా ఎగ్రిమెంటన్నారు; ఇండోచైనా సమస్య పరిష్కారం అన్నారు. కెనడా, పోలండు, ఇండియాలు కలిసి పనిచేస్తాయి అనీ, ఇండియా మనుషులు కార్యాలయంలో పనిచేస్తారనీ అన్నారు. మనుషులను యెంచేరు, పంపించేరు. సెప్టెంబరు పందొమ్మిదిదాకా, దినం విడిచి దినంవూ, సాయంకాలం విమానాల్లో నియమితులైన వాళ్లు - ఆఫీసర్లూ తదితరులూ - దిగడ్డారు. విమానంలో ప్రయాణంవూ, కలకత్తా (బారక్‌పూర్)లో ఆరంభించిన దగ్గిర్నుంచీ హానోయ్ విమానాశ్రయం చేరుకునే వరకూ ముచ్చట్లూ, అనుభవాలూ - చిక్కుల్లో ఉన్నవాడిని మినహాయిస్తే - మిగతా వాళ్ళందరికీ బాగానే వున్నాయి; బాగా వినోదంగానూ ఉన్నాయి. మీరంతా ఆ "మిగతా వాళ్ల"లో జమ అవుతారు గనక, యిహ వినండి!

తొలి ప్లేను 9-9-54 న కలకత్తానుంచి బయలుదేరుతుందనీ, నాటికి ఒకరోజు ముందుగా అంటే 8-9-54 కలకత్తా (బారక్‌పూర్) విమానాశ్రయపు అధికార్లకి రిపోర్టవాలనీ అన్నారు. ఇంకా ఏవేవో సూచనలిచ్చేరు. ముఖ్యంగా కలరా వగైరాలకి యింజక్షనులు పుచ్చుకోవాలనీ, భారీసామాను వేరే యింకో ట్రెయినులో పంపించాలనీ వగైరా. ఇవన్నీ 3 వ తేదీ అపరాహ్ణం తిరిగితేనేగాని! సరిపడలేదు. నాలుగో తేదీ శనివారం. అసలు ఇండో[illegible]లో ఉద్యోగపు ఆర్డరు అప్పటికి యింకా సైక్లోస్టయిలు అవు[illegible]ంది. అది అందుకుని చూపిస్తేనేగాని మిలటరీ ఆస్పత్రివాళ్లు యింజక్షన్లూ అవీ యిచ్చి, అలా యిచ్చినట్లు అంతర్జాతీయ సర్టి[illegible]కేటు (!) యివ్వాం అన్నారు. ఈలోగా యింట్లో సామాన్లు సర్దు

కోవాలి. యింటి ఆవిడిని ఓదార్చాలి. పిల్లలకి మిఠాయి కొని పెట్టాలి (ఊరికి వెళ్ళిపోతున్నాం అనేసరికి, ప్రేమా అభిమానమూ పెల్లుబికి వొస్తాయి మరి!) తను బట్టలు కుట్టించుకోవాలి. అన్నింటి కన్నా ముఖ్యం విమానంలో తీసుకెళ్ళడానికి ఓ ఫైబరు సూటు కేసో, తోలుపెట్టో కొనుక్కోవాలి. సందట్లో సడేమియ్యా, స్నేహితుల టీపార్టీలు!

సరే యిన్ని చికాకులూపడి తీరా మిలటరీ హాస్పటలికి వెళ్ళేసరికి, వాడు నాలుగు సూదిపోట్లూ పొడిచి "ఇంటర్నేషనల సర్టిఫికేటు" ఫారాలు అయిపోయినాయి అన్నాడు. ఏం దారి భగవంతుడా అని ప్రాధేయపడితే, "మీ ఆఫీసునుండి ఫలానాఫారం కావాలని ఓ కాగితంముక్క పుట్టించుకుని, అది హెల్తు మినిస్ట్రీ వాళ్ళచేత సిఫారసు చేయించుకుని, ఎక్కడో అయిదుమైళ్ళ దూరంలో ఎర్రకోటలో ఉన్న ఆఫీసులోకి తీసుకెళితే అక్కడ దొరుకుతాయి; అదైనా ఫారానికి అణా ఛార్జిచేస్తారు" అన్నాడు. "ఆ అణా డబ్బులికీ ట్రెజరీలో చలానా కాగితం పుచ్చుకుని, తాసీల్దారు కచేరీలో స్టాంపు వేయించుకుని, రిజర్వుబేంకులో చెల్లించక్కర్లేదా?" అన్నాను, ఏడవలేక నవ్వే మొహంపెట్టి! అదలా ఉండనియ్యండి.

పరమానందయ్య శిష్యుల్లాగ, యించు మించుగా ప్రతివాడూ, కలకత్తాలో దిగుతూనే, ఢిల్లీలో యిచ్చిన తాఖీదు ప్రకారం 16 మైళ్ళ దూరంలో ఉన్న బారక్ పూరు ఎయిరోడ్రోముకి టాక్సీకట్టించుకు వెళ్లేడు. కాని అంతటితో కుదుటపడిందా ప్రాణం? అక్కడి మిలిటరీవాళ్లు మా కాగితాలూ అదీ చూసి, "ఇది కేవలం మిలటరీ వాళ్ళకి; మీరు సివిలియన్సు; మీ ఆఫీసరు కలకత్తా ఎస్ప్లనేడు ఆఫీసులోఉన్నాడు; అక్కడికి పొండి" అన్నా రానూపోనూ టాక్సీవాడికి పదహారు, పదిహేడు రూపాయల ముడుపు! ఈ ముక్క ఢిల్లీలోనే అఘోరిస్తే ముచ్చెవకతో తెమిలిపోయేది బేరం. టాక్సీమీద వొచ్చినాను!!

ఆ రాత్రి పన్నెండు వలభైకల్లా నిద్రలేపి, ఆ కునుకు కళ్లతోనే (సూటూ బూటూ వేసుకున్నా, అర్ధరాత్రప్పుడు మొహం మొక్కడ కడుక్కోను?) వాళ్ల ఆఫీసుస్టాఫ్ కార్లో బేరక్‌పూరు ఎయిరోడ్రోముకి జేర్చేరు, మమ్మల్ని. అక్కడా మిలటరీ పుట్ట. ఓ కేప్టిను వొచ్చి సామాన్లు తూచేడు. మనిషిని తూచేడు. మనిషినీ సామానూ కలిపి తూచేడు. నాలుగు పౌన్లు ఎక్కువ వుంది. ఆ ప్రాప్తికి సామాను తీస్తేనేగాని నువ్వు వెళ్ళడానికి వీల్లేదన్నాడు ఒకర్ని. ఇహ చూచుకోండి మాకు పట్టుకున్న గుండె దడ. నడిమధ్యస్థంగా నాలుగు గుడ్డముక్కలుతీసి ఎక్కడ పెట్టడం-; ఎవరికిచ్చెయ్యడవూ? పరాయిదేశం వెళుతున్నాంఏమో, అన్నీ కొత్తచొక్కాలూ కొత్త పంట్లాంలూను! స్టేషనుకొచ్చిన కామాక్షత్తా, పోదెమ్మపిన్నీ కారుగదా, అక్కడున్నవాళ్లు, "పోనీ వీళ్ళకియిస్తే ఆతరవాత నెమ్మదిగా బంగీకట్టి పంపుతారు" అనుకోడానికీ!

భవతు. అంతమాత్రంవే అయితే ఏ గొడవా లేకపోను. కాని అంతటితో తెల్లవారిందీ? అంతలో ఓ మిలటరీ డాక్టరు తయారు అయి, "నీకు జ్వరంగాఉంది వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడొక ఆసామీని పరీక్షించి. ఇంజక్షన్ల దెబ్బరాబాబూ అంటే వాడువింటేనా? ఇంకొకడి సర్టిఫికేటుచూసి "యిది టైపు చేసిన కాయితం; అచ్చు ఫారంమీద ఉండాలి సర్టిఫికేటు" అన్నాడు. ఫారాలు అయిపోయేయి, గురూజీ, ఇది అచ్చుకినకలేను అని యెన్ని చెప్పినా ఇహ వాడిమాట వాడిదే!

తీరా తెల్లవారుఝాంన నాలుగున్నరకి ప్లేనులోపడి, తలుపు లేసుకుపోవడం కళ్ళారాచూసి, ప్రొపెల్లర్లు మోతవిని "అమ్మయ్య" [illegible]కుంటూ సిగరెట్టు ముట్టించబోదునూ? ఎక్కడో పొంచి [illegible]న్నట్లు "కోపైలటు" టకీమనివొచ్చి పది నిమషాలదాకా సిగరెట్లు వగైరా వల్లకాదన్నాడు. వెలిగించిన అగ్గిపుల్ల ఊదేసి నోరుమూసు[illegible]కుచున్నాం. చీకట్లో ఏం చూడనూ? కన్నూ మూతపడింది,

నోటితో పాటు. ఓ రాత్రప్పుడు లేపేసేరేమో, నిద్ర రేపట్టేసింది. ఆరింటికల్లా ఎవరో వొచ్చి లేపేసు, ఉదయపు ఫలహారం అంటూను. సందడి కనిపెట్టి నేను బాత్ రూమ్‌లోకి పోయేను. తిరిగి వొచ్చి టీ పుచ్చుకుంటుంటే ప్రక్కనున్నాయన అడిగేడు.

"మొహం కడుక్కున్నారూ ?"

"ఆహా"

"అదికాదండీ, చేతిపెట్టితో సహా అన్నీ 'ఫ్యూసిలాజి'లో పడేసేసుగదా..." కోటు జేబులోంచి పళ్ళపొడి తీసి యిచ్చేను. పదిమందీకలిసి పళ్లపొడి ఊదేసేసు. మనకి పలుకుబడి హెచ్చిపోయింది, పళ్ళపొడి ధర్మంవా అనీ !

ఎనిమిదీ నలభైకల్లా రంగూన్ ఎయిరోడ్రోము చేరుకున్నాం. ఓ గంట విశ్రాంతి. ఎయిరోడ్రోం వాళ్లూ నలుగు రేసికి ఒకొక్క టేబిలు అమర్చి టీ, సాండ్విచ్చిలు (తలో రెండుచొప్పున) పెట్టేసు. ఒక ఆసామీ, పాపం, కూచునీ కూచోవడంలో ఉన్నవన్నీ ఊడ్చేసేడు. సెర్వరు నిర్ఘాంతపోయేడు ఈ మనిషి సాండ్విచ్చిలు ఎప్పుడూ ఎరగడా ఏంవిటి చెప్మా? అనీ. కొందరికి జఠరం విపరీతంగా పని చేస్తుందని అందరికీ యెలా తెలుస్తుంది, పాపం !!

ఆ సాయంకాలం 2-30 కల్లా హెనోయ్ విమానాశ్రయం చేరుకుని వెంటనే గడియారాలు 2½ గంటలు ముందుకి మార్చేం. అంతలోకే కారుయెక్కి బసకి చేరుకున్నాం. కాస్సేపట్లో చీకటి పడింది. భోజనాలవేళ అయింది. కెనడావాళ్లూ, పోలండు మనుషులూ, మనం అంతా కలిసి భోజనాలు. అది బాగానే ఉంది ఉపక్రమించే వరకూన్నూ. తీరా కూచున్నాక ఒకడిమాట ఒకడికి తెలియదని తెలిసింది. పై దేశస్థులకీ మనకేకాదు; హా[illegible] సెర్వుచేసేవాళ్ళకి మనకిని. చేతులు సర్కస్సు చేసేయి. ఫలిత శూన్యం. అవతల టేబిల్సుమీది కెనడావాళ్ళూ, పోలండు వాళ్ళూ నిక్షేపంలాగ లాగిపారేస్తున్నారు. మనకి నోరు ఊ[illegible]

తోంది; కడుపు కాలుతోంది; కళ్ళు తేలుడుకళ్ళు పడిపోతున్నాయి.
"ఉప్పురా! నీ యమ్మకడుపుగాలా!" అన్నాడొకాయన.

"ఉఫ్, ముస్యూర్? వీ. వీ" అంటూ వెళ్ళిపోయి, రెండు నిముషాల్లో డజను ఉడికించిన కోడిగుడ్లతో తయారయ్యాడు, సెర్వరు!

పక్కనుంచి యింకో సెర్వరు అన్నం పళ్ళెం పట్టికెళుతూ కంటపడ్డాడు. మన ఆసామీ అమాంతం వాడి జబ్బపట్టుకుని, వాస్తువ చూపించి, బలవంతాన లాక్కున్నంత పనీచేసేడు. ఇంతా చేస్తే ఒట్టి అన్నం యెలాతింటాడూ! అయితే భగవంతు డనేవా డొకడు ఉన్నాళ్ళేండి. కాఫీకోసం పెట్టిన కన్‌డెన్స్‌డ్ మిల్కు (పాలడబ్బా) కంటపడింది. ఇహనేం? అన్నం పాయసం అయి ఊరుకుంది ఆయనికి! మర్నాటినుంచీ కాఫీకి పాలులే వన్నంతపనీ జరిగింది! అసలు గొడవంతా మంచినీళ్ళదగ్గర వొచ్చింది. ఇక్కడ యెవ్వడూ – బీదా బిక్కికూడా – మంచినీళ్ళు తాగడు. దాహం వేస్తే పచ్చి టీనీళ్ళో (పాలూ, పంచదార ఉండదు), లేకపోతే యీ దేశంలో తయారుచేసిన బీరో తాగుతారు. అడుగుతేనేగాని నీళ్ళు పుట్టవ్! అడగడానికి మాట తెలియదు. వీళ్ళంతా స్వభాష వియట్‌నామీజ్ గాని, సర్కారుభాష ఫ్రెంచిగాని అఘోరిస్తారు. ఆ రెండూకూడా మనకి పూజ్యం.

మనుషులు లేకపోతే యిల్లే బిక్కు బిక్కు మంటూ ఉంటుంది యెంత చిన్నదైనాను. ఊరయితే బొత్తిగా నేను. అదీ హెనాయ్ అవస్థ సెప్టెంబరు తొలివారంలో మేం దిగడేసరికి. కాస్త చెప్పుకో దగ్గ భవంతి అన్నదల్లా — జనం పై ఊళ్ళకి తరలి వెళ్ళి పోవడం మూలాన్ని – ఓ స్మృతిచిహ్నం అయి ఊరుకుంది. దానికి [illegible] ఊః మిలటరీవాళ్లు! స్కూలు భవనాలూ, కాలేజీ బిల్డిం గులూ, హోటేలు భవంతులూ, అదీ యిదీ యేంవిటి, భారీ అయిన కొంపగనక అయితే తప్పకుండా ఫ్రెంచి మిలటరీవాళ్ల ఆక్రమణలో [illegible]దన్నమాటే.

ఇహ ప్రజాసంచలనం లేదనే చెప్పాలి. పొద్దున్న 10 గంటలకి కాదు, సాయంత్రం 6 గంటలకికాదు, ఎప్పుడు వీధులోకి వెళ్ళినా రోడ్లు "పాడూగ్గా" కనిపించేవి – ఏ మూలా పిట్టమనిషి లేకపోవడం మూలాన్ని! బిక్కు బిక్కు మంటూ వీధి చివరలని మట్టుకు నలుగురు మిలటరీవాళ్లు కనిపించేవాళ్లు, పహారాకాస్తూను. ఇహ చెప్పుకోదగ్గ మూడు పెద్ద హోటేళ్లూ మా అంతర్జాతీయ కార్యాలయంలో పనిచేసేవాళ్లకీ, మూడు దేశాల సిబ్బందికి కేటాయింపయిపోయినాయి. రిక్విజిషను చేసేసేరు. కాగాపోగా రోడ్డు మీద కనిపించేవాడు – మా మూడు దేశాలవాడూ కాకపోతే – రిక్షావాడూ, ఇహను యెటుపోవడానికి గతిలేక మిగిలి పోయిన వాడూను. ఈ దేశపు తగుమనిషి అనిపించుకున్నవాణ్ణి ఎక్కడా చూళ్ళేదు, రోడ్లమీద ఆరోజుల్లో. ఇంక ఆడవాళ్ళ సంగతిచెప్పనే అక్కర్లేదు. ఒహడూ అరా ఎప్పుడైనా తప్పి దారీ కంట పడ్డా, ఏంవిటో దేనికో భయపడిపోయిన వాళ్ళలాగ చప్పు చప్పున పక్కకి తొలిగి పోయేవాళ్లు! ఏడేళ్ళయి యుద్ధానికి గురి అయిపోయినారేమో, బాహాటంగా రోడ్డుమీదికి వొస్తే యెక్కడ యెవడు ఏంవి అల్లరి చేసిపోతాడేమోనన్న భయంవేను, పాపం, వాళ్లకి. అదలా ఉండనివ్వండి.

యూనివర్సిటీవేపు వెళ్ళేం. అక్కడా యిదే తంతు. బిల్డింగులుమట్టుకు పెద్దవి ఉన్నాయి. ఫిజిక్సు, ఫిజియాలజీ, కెమిస్ట్రీ వగైరా ఒక్కొక్క శాఖకి ఒక్కొక్క బిల్డింగు ప్రత్యేకించిన్నీ, మేరు పర్వతాల్లాగ. ఇవిగాక వాటికి సంబంధించిన లేబరేటరీలు ఆ తరువాత వాటి తాలూకు "రిసెర్చి" డిపార్టుమెంట్లు. ప్రతి భవంతికీ బిల్డింగునిబట్టి క్రమం అయిన పెద్దకాంపౌండూ అందులో పెద్ద పెద్ద చెట్లూనూ, అయితే ఎందుకూ? చచ్చినవాడికళ్ళు చేరడేసి ప్రతిబిల్డింగు గేటుదగ్గిరా ఫ్రెంచి సోల్జర్లు, తుపాకులూ వీళ్లున్నూ, ఏదైనా భోగట్టా తెలుసుకుందాంఅని, మాట తెలిసినవా

ఫ్రెంచిలో అడిగినా "వెళ్ళడానికి వీల్లేద"న్న ముక్కకి మినహా మిగతాదంతా "ససేమిరా" యే !

ఇహ బజారు యెలాఉందో అని చూడ్డానికి వెళితే, పనికి వొచ్చేవోస్తువ వొక్కటీ కనపళ్ళేదు. ఇక్కడ నాణెం "పియాస్ట్రి". గవర్నమెంటు రేటుప్రకారం 1 రూపాయికి 7.35 పియాస్ట్రిలు; కాని నల్లబజారులో 1 రూపాయికి 12 యింకా పథ్నాలుగు పియాస్ట్రిలకి కూడా మారింది. దీనికి కీలకం మరేంలేదు మద్రాసు మాయవరం తురకవాళ్లు కొంతమంది ఏ పదిహేను యిరవైయేళ్ల క్రిందటో వచ్చి యిక్కడ వర్తకం ప్రారంభించేరు. చాలామంది బట్టలవ్యాపారస్థులు; కొద్దిమంది వాసన్నూనెలూ, పౌడర్లూ, పిల్లల ఆటవస్తువులూ అదీ యిదీ అమ్ముకునే జవరల్ మర్చంట్సు' వీళ్లల్లో ఒక్కడికీ ఒక హిందూస్థానీ ముక్కగానీ, ఉర్దూముక్కగానీ రాదు. అరవం బాహాటంగా మాట్లాడతారు. మనబోటి నల్ల మొహాలు కన్పిస్తే నవ్వుతూ పలకరించి మాటామంచీ ఆడతారు. వీళ్ల బంధు కోటి అంతా మద్రాసులోనే. ఇక్కడ వ్యాపారంలో వొచ్చిన డబ్బుపెట్టి అక్కడ భూమి పుట్రా కొనుక్కుంటారు. అయితే ఫలానా యింతసొమ్ము (పియాస్ట్రాలలో) కన్నా పంపడానికి వీల్లే దని రూలు. అంచేత వాళ్లదగ్గరున్న పియాస్ట్రిలు మన రూపాయి ల్లోకి మార్చుకుని, ఏ సైగాన్‌లోనో వీట్ని మళ్ళీ 14 యింకా 16 పియాస్ట్రిల చొప్పున ఫిరాయించి సొమ్ము చేసుకుంటారు.

అసలు ఫ్రెంచివారి ప్రాబల్యంమూలాన్నే కానివ్వండి, ఏడేళ్ళయుద్ధం పరిణామంగా కానివ్వండి, పియాస్ట్రిలకి విలువ లేక పోవడం మూలాన్నే కానివ్వండి, ధరలు విపరీతంగా పెరిగిపోయి నాయి. క్షవరానికి 35/- పియాస్ట్రిలు (నాలుగు రూపాయల ఏవలా) అంటే మిగతా ఏమీ చెప్పనక్కర్లేకుండానే ఊహించుకోవచ్చును! ఆ రోజుల్లో ఒక్క పార్కరు సిరా మాత్రం ఎంచేతనో చవకగా అమ్మేరు, 7/- పియాస్ట్రిలకి – అంటే రూపా యికలోపు. "కాకీ" పళ్ళు (సపోటా పళ్ళలాంటివి; అంతకన్నా

కొంచెం పెద్దవీని) ఒక్కొక్కటికీ మూడు పియాస్ట్రిలు. అరటిపళ్ళు యిరవై పళ్ళున్న పెడ 12 పియాస్ట్రిలకి కొన్నాం. ఇంక స్నాక్లూ అవీ అయితే వేలమీాదే లెఖ్ఖ; మూడు వేలకి తక్కువ ఏసూ టే లేదు. అయితే, కొనేవాళ్ళూ లేరు పాపం. చాలామంది భయపడి పోయి దక్షిణాన్న హైఫాంగులాంటి ఊళ్ళకి పోయినారు. దుకాణపు వాళ్లు మున్ముందు ఎలాగుంటుందో అని కొంతసరుకు దక్షిణానికి సైగాను, హైఫాంగు వగైరా ఊళ్ళకి తోసేసి, మిగతావాటికి ధరలు పెంచేసేరు మాబోటిగాళ్ళం (జనాభా తక్కువ లేదులెండి) కొంటాంగదా ఎంత ధరకయినా అని. ఇంత చెప్పినా బజార్లో కళ లేదనే అనాల్సి వొస్తూంది. ఎలక్ట్రిక్ దీపాలుపెట్టి, వొస్తువులు పేర్చగానే బజారయిందా మరీ?

ఇహ కాస్త కనుచీకటి పడుతోందనే సరికి, ఆ కనిపించే నలుగురూకూడా కంటపడరు రోడ్లమీాద. అక్కణ్నుంచి ఝాంరాత్రి దాకా తాగి తందనాలాడే ఫ్రెంచి మిలటరీవాళ్ళూ, వాళ్ళని ఆధారంగా చేసుకుబతికే "అణా కానీ ముండలున్నూ" ఏవీధి మలుపునా ఏ చెట్టు కీనీడనీ చూసినా యిదే రభస!

అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లుడినోట్లో శని ఉన్నదన్నట్టు కాస్త ఊరిపొలిమేరలు దాటి వెళితే అరిటిచెట్లు, పనసచెట్లు, పంపర పనాసచెట్లు, గుమ్మిడి, బెండ, వంగ, చిక్కుడు మొదలయినకాయ గూరలూ సమృద్ధిగా కనిపిస్తాయి. అయితే సరిగా చూసుకునే మనుషులు లేకా - యుద్ధభయం మూలాన్నీ - ఎక్కడి వక్కడ వొదిలిపెట్టి పోయేరు మరి - మిలటరీవాళ్ళ అల్లరి మూలాన్నీ, సరియయిన రవానా సౌకర్యాలు లేక సమృద్ధిలో కాటకం అనుభవించింది హెనోయ్. అసలు ఏ కాంపౌండులో చూసినా గన్నేరు, నూరు వరహాలచెట్లూ, నందివర్ధనం మొక్కలూ, గులాబీ వగైరా పచ్చగా శోభాయమానంగా కనిపిస్తాయి; ప్రస్తుతావస్థలో ఊరు వెర్రిగా పెరిగిపోయినా, బంగళాల్లో మనుషులు ఉన్నప్పుడు ఎంతో శోభాయ మానంగా ఉండేదని తెలుస్తుంది.

యుద్ధంమూలాన్ని ఊరు ఎంతకళా విహీనం అయిపోయిందో చెప్పడానికి వీల్లేదు. ఊళ్లో ఎక్కడా పశువుల మందలన్నవి కనిపించవు. ఉదయాన్న కాకిగాని గద్దకాని కనిపించదు. రైలుస్టేషనూ, పోస్టాఫీసూ ఏనాడో మూసేసేరు. రోడ్లు - హైనాయ్ పొలిమేరలు దాటక - పాడయిపోయి, గోతులు పడి చెడిపోయి ఉన్నాయి. జీప్‌లో వెళ్ళినా అతికష్టంమీద గంటకి 10 మైళ్లు స్పీడుకంటే ఎక్కువ లేదు.

## 2. గడ్డురోజులు

వేం నెమ్మదిగా గానుగఎద్దులాగ తయారయేం, ఓమూడు నాలుగు వారాలు తిరిగేటప్పటికి. ఉదయాన్నే లేవడం, కాఫీ అదీ పుచ్చుకుని ఎదరగా ఏ వీధి కనిపిస్తే అందమ్మటపడి ఓ అరగంటో, గంటో తిరగడం, తొమ్మిదింటి కల్లా కచేరీకి చేరుకోవడంన్నూ. ఆ రోజుల్లో 9 నుంచీ 5 దాకా పనిచేసేవాళ్ళం. ఆ తరవాత యింటికి వొచ్చి, మొహం అదీ కడుక్కుని, మళ్లీ తయారు ఎనిమిది గంటల దాకా చాంద్రాయణానికి ! ఆ యీ తిరుగుళ్ళలోనే ఊరు కాస్త చూడ్డానికీ, పరిస్థితులు ఆకళించుకోడానికీ అవకాశం మాకు.

రానురాను, ప్రతిరోజూ—ముఖ్యంగా అక్టోబరు ఒకటో తేదీ లగాయితూ - మాకు కంటపడేది ఒక్కటే దృశ్యం. నిన్నటి దాకా తెరిచి ఉంచిన షాపు యివాళ మరిలేదు. షాపు యెదురగా పెద్ద లారీయో, ట్రక్కో కనిపించేది. షాపులో సామాను ఆబళ్ళలో సర్ది ఉండేది. ఇలా యే రోడ్డుమీద చూసినా ఫ్రెంచి తరహా హోటేళ్లు, సినీమాలూ, దుకాణాలూ అన్నీ మూసేసుకుని లారీలోనూ, ట్రక్కుల్లోనూ, టాక్సీల్లోనూ వెళ్లిపోయేరు. "అసలే ముక్కిడి దానిమీద పడిశం" అన్నట్టు, ఆదిలోనే జనాభా బహు స్వల్పంగా కనిపించేవారు; ఊరు దిబ్బలాగ కనిపించేది; ఆ వున్న వాళ్లూ వెళ్లిపోవడం మొదలెట్టడంతోనే బొత్తిగా నేను.

ఏంవిటా సంగతీ అని కనుక్కున్నాను. డబ్బు ఉన్నవాడికి భయం యెక్కువ. ఈ వెళ్లినవాళ్లంతా బాగా పెద్దపెద్దవ్యాపారస్థులూ సినిమా ప్రొప్రైటర్లూ, హోటేల్ ప్రొప్రయిటర్లున్నూ; కొత్త ప్రభుత్వం ఎలాగుంటుందో యెవ్వడికీ తెలియదు. కాగా విన్న కబుర్ల మూలాన్న, స్వంతడబ్బు ప్రభుత్వం తీసుకుంటుందేమో నని భయం; అదలా ఉంచగా "ఫ్రెంచివాళ్లు దక్షిణానికి పోతే మా పేరిస్ హెయిరాయిలూ, లవండర్లూ, సినీమాలూ, షోకులూ యెవరికి కావాలి బాబూ!" అనేవాళ్లు. ఇందువల్ల మనకి వొచ్చిన ముప్పు మరేం లేదుగాని, 13 పియాస్త్రిలకి అమ్మే సిగరెట్టు పేకెట్టు 13, 15, 19, 25, 30 పియాస్త్రిల దాకా పెరిగిపోయింది!— సిగరెట్టు ఫ్యాక్టరీలు మూసెయ్యడం మూలాన్ని.

## పకోడీలు, చట్నీ

అప్పటికప్పుడే మూడువారాలకి పైగా అయింది; మేం ఇంగ్లీషుపద్ధతిని భోజనం చేస్తూఉండేవాళ్లం. ఏ వస్తువా చప్పగా ఉడికించి తగలెయ్యడంవేకాని, కారం పులుపూ అన్నమాట ఉండేదికాదు. ఓనాడు సాయంకాలం ఊరమ్మట తిరుగుతూ అనుకున్నాం: "చెన్నపట్నంనుంచి ఢిల్లీవరకూ ఏ ఊరు వెళ్లినా పకోడీలనేవి భజియాలనో మరే పేరుతోనో అఘోరిస్తారుకదా, ఆ బాపతు వొస్తువ యిక్కడమాత్రం ఉండదా?" అనీ చిల్లరతిళ్లు అమ్మే చిన్న చిన్న దుకాణాలన్నీ – పధ్నాలుగువీధుల మొత్తమ్మీదా, పట్టుమని పుంజీడు దుకాణాల్లేవు! గాలించేం. ఏ దుకాణంలోచూసినా ఉడికించిన నత్తగుల్లలూ, బాతులూ, ఎలకలూ వాళ్ల పిండా కూడునూ! చివరకి కూరలబజారులో తేలి పియాస్త్రిపెట్టి అల్లం ముక్క కొనుక్కుతిన్నాం.

కానయితే నాతోకూడా ఉన్నాయనకూడా తెలుగువాడు, కాస్తరుచిగా భోంచెయ్యడం అంటే ఆయనకి ప్రీతి. అల్లంముక్కతో తృప్తిపడిపోవడం ఆయనకి అట్టే మనస్కరించలేదు. ఇహ రిసెప

మొదలెట్టేం – అరవ్వాడిహోటలు ఏదైనా ఉండకపోతుందా అని. ఉండకపోతుందా మరి? అవతల పెద్దబజారులో ఏదో ఓ హోటేలు ఉందిట అన్నారు, యెవరోను. తూర్పున ఉన్నవాళ్ళం పడమటికి వెళ్లేం కాళ్ళీడ్చుకుని. ఒకారిద్దరు మాయవరం తురకాళ్లు కనిపిస్తే, వాళ్ళని మెల్లిగా భోగట్టాచేసి ఆచోకీతీసేం; వెళ్లేం, అదీ ఓ తురక వాడి హోటేలేను! అచ్చంగా చీపురుపల్లి బస్సుస్టాండుదగ్గిర కాఫీ దుకాణంలాగ ఉంది; ఎటొచ్చీ అది పాకా, యిది పెంకుటిల్లూనూ. వాడు నవ్వుతూ పలకరించి మాట్లాడి, కబుర్లతో కడుపునింపేసేడు. ఆదిలో నేను సాంబారూ అదీ కావాలంటే ప్రత్యేకించీ మీకోసం చెయ్యాలి. ఓనాడు ముందుగా చెప్పండి అన్నాడు. అప్పటిమట్టుకు జిహ్వ శాంతిపరచడానికి ఓ అరడజను "బోండాలు" ప్లేట్లో పెట్టి పట్టుకొచ్చేడు;

"చట్నీ గురూ?" అన్నాను.

"కొంచెం యిరుంగో, సార్, తయార్ పండ్రేం" అన్నాడు వాడు.

వాడైతే మాయవరం వాడుకాని, హోటేలు యీ వూరి వాళ్లకోసం పెట్టుకున్నాడన్న ముక్క అంతవరకూ తట్టలేదు, మాకు!

చట్నీలో ఏమాత్రం కారం వెయ్యాలో మేం పురమాయించేం.

చారు వాడే యిచ్చేడు.

బిల్లుచూస్తే చారు ఫ్రీ. ఛట్నీకి 7 పియాస్ట్రిలు (అంటే పధ్నాలుగణాలు!).

చూస్తూఉండగా ఆవారం గడిచి పోయింది. అక్టోబరు పదో తేదీన ఫ్రెంచివాళ్లు వియట్ నామ్ వాళ్లకి హెనోయ్ పట్నం అప్పచెప్పి వెళ్లిపోతారు అన్నారు. ఎనిమిదీ, తొమ్మిదీ, పదీ ఆ మూడురోజులు ఫ్రెంచి పటాలాలు పట్నం ఖాళీచేసి దక్షిణానికి తరలి వెళిపోతాయి గనక, ఆ మూడురోజులూ యిరవైనాలుగు

గంటలూ "కర్ఫ్యూ" అన్నారు. తప్పనిసరిగా కచేరీకి వెళ్లాలి గనక మాకు భుజకీర్తులు (తెల్లని పట్టీమీద ఐ. సి. అని రాసి ఉంటుంది) యిచ్చేరు. ఇవి వేసుకునైనా హోటేలుకి వెళ్లి భోంచెయ్యడం, కచేరికి రావడం తప్పితే యిక రోడ్లమ్మట తిరగడానికి వీల్లేదని స్ట్రిక్టుగా యిన్స్ట్రక్షన్సు యిచ్చేరు – ఎట్నుంచి యెటు వొస్తుందోననీ. ఆ హోటేలుకి వెళ్లినప్పుడయినా ముగ్గురు నలుగురు కలిసి జట్టుగా వెళ్లండి కాని, ఒక్కమనిషిగా వెళ్లడానికి వీల్లేదని వార్నింగు పారేసేరు! రోడ్లమీద చూస్తే ప్రతి ఫ్రెంచి సోల్జరూ మమ్మల్నే తీక్షణంగా చూసినట్టనిపించేది, పట్టపగలేను.

ఎనిమిదో తేదీ గడిచింది. తొమ్మిది సాయంకాలం దాటి చీకటిపడింది. నేనేదో పట్నంలో చూసిన బాపతు డైరీలో నోట్సు రాసుకుంటూ ఉండిపోయినాను. ఏడున్నర అయిపోయింది! కర్ఫ్యూ మూలాన్ని, మరో అరగంట కనక అయితే ఆ పూటకి ఏకాదశే నన్నమాట అప్పుడు తట్టింది. గదిలోంచి బైటికి వొచ్చిచూస్తే మిగతా గదులన్నీ వేసిఉన్నాయి. అందరూ ఉడాయించేసేరు భోజనాలకి!

"సాపాటాచ్చో?" అంతలో వెనకనుంచి మా సారధిపిలుపు!

అతను ఆఫీసులో ఉండిపోయాట్ట అంతవరకూను. ఇద్దరం కలిసి వెళ్లేం భోజనానికి. మస్తుగా మేసేం.

కాని తిరిగేకాలూ, తిట్టేనోరూ ఊరుకోవు అంటారు. గత రెండు రోజులబట్టీ బొత్తిగా బందికానాలాగా అయిపోయింది. కర్ఫ్యూ మూలాన్ని రాత్రి భోజనం 6 మొదలు 8 దాకానేను. మా భోజనాలు అయేటప్పటికి యింకా ఎనిమిది అయినా కాలేదు. ఇహ తెల్లవార్లూ ఎంతకని పడుకోవడం? ఇంటికి వెళ్లడానికి బుద్ధి పుట్టిందికాదు. ఎటు వెళదాంవా అని అనుకుంటూ హోటేలును ఓ పదిగజాలు అలా వొచ్చేవో లేదో, ఎదరగా అడ్డరోడ్డుమీద వెళుతూన్న మిలటరీ లారీ వొహటి "కీచు" మంటూ సడెన్గా

ఆగింది. "ఆ గాడిద మనల్నిగురించే అనుమానపడ్డాడండోయ్"
అన్నాడు, మా నిప్పాణి నరసింహారావుగారు.
ఆ ... న వాక్యం పూర్తిగానేలేదు — మిలిటరీలారీ వెనక్కి—
నాలు గడుగులు వెళ్లి, అట్నుంచి యిటు తిరిగి, మాకు ముఖస్థం
అయింది; రెండడుగుల్లో నిలిచింది. అది ఆగీ ఆగకముందే పక్క—
సీటులోంచి ఫ్రెంచి సోల్జరు కిందికి దూకడానికి సిద్ధంఅయ్యేడు.
అంతలో నా కుడిభుజాన్ని తేల్లపట్టీ, దానిమీద I. C. అన్న
అక్షరాలూ కంటపడ్డాయి. "కమీసియా నేంతర్నా సియనాల్"
అని గొణిగి లారీ పోనిచ్చేడు. మా మొహాలమీద చిన్న నవ్వు
తునక (బెంగ కాస్తా తీరిపోయాకా!)!!
ఓ చుక్క వేసుకున్నవాడికి మరోచుక్క వేసుకోవాలని
ఉంటుందిట, మా పార్థసారథి రెండడుగులు అలా వెళదాం
అన్నాడు — ఆ పై వీథుల్లో బందోబస్తు యెలాఉందో చూద్దాం
అనీ. చెప్పొద్దూ? నాకూ కాస్త అలా తిరుగుదాం అనే అనిపించింది.
మరో పదిగజాల్లో తిరగనే తిరిగేం మలుపు. ఎక్కడో ఎదర
ముప్పైగజాల్లో క్రాసింగ్‌లో నిలుచున్న సార్జంటు, మొలనున్న
రివాల్వరుమీదచెయ్యి భద్రంగా ఆనించి, నిమిషంలో మావేపుకి
వొస్తున్నాడు. అన్నట్టు చెప్పడం మరిచిపోయేను ఆవేళ చిన్న
చినుకూ. నా చేతిలో గొడుగుఉంది. మా సారథిది రెయిను
కోటు! ఆ ఫ్రెంచిసార్జంటు తిన్నగా మా దగ్గిరకి వొచ్చేడు.
నా కుడిభుజాన I. C. బేడ్జి చూస్తూనే సెల్యూటు చేసేడు. కాని
అంతటితో కుదిరిందీ? మాసారథి పక్కని చేరి "మీరో స్వామీ?"
అన్నాడు.
సారథికి ఒక్క ఫ్రెంచి ముక్కైనా వొస్తే వొట్టు!
అయితే మహాగడుసుతనం. ఇంగ్లీషులో చెబుతున్నాడు
నూ ఇంటర్నేషనల్ కమీషన్‌వాణ్నేనని. వాడు ఆ ముక్క
చెప్పి, రెయినుకోటులోనుంచి చొక్కా—జేబులో చెయ్యిపెట్టి
"ప్యాసు" తీసి చూపించేలోపున అప్పుడే కుడిపక్కన

బాటమ్మటే అరడజను సోల్జర్లు తుపాకులు ఎత్తిపెట్టుకుని సిద్ధం అయ్యారు. వాళ్ల వేళ్లు ట్రిగ్గర్లమీదే వున్నాయ్. ఇహ. మరి రోడ్డుమీద పిట్టమనిషి లేడు. ఆ తరవాత అయిదుగురూ సెల్యూటుచేసి మమ్మల్ని పోనిచ్చేరనుకోండి, అది వేరేసంగతి. కాని నాటి ఆ దృశ్యాలుచూస్తే యుద్ధంగోడవా, మిలిటరీనాళ్లే అడావిడీ చచ్చినా మరచిపోం మరి !

# 3. అక్టోబరు పది

ఆ సాయంత్రం మళ్ళీ సాయంగా తిరిగి వొచ్చి యింట్లో కూచున్నాం; ప్రతి పదినిమిషాలకీ ఓ పెట్రోలులారీయో, ఆర్మర్డ్కారో, మరేదో వెళ్లినశబ్దమే. ఓ రాత్రిదాకా కిటికీల్లోనే ఉన్నాయి మాకళ్లు.

తెల్లవారింది. మామూలుగా హోటేలుకి వెళ్లేం. తొలి నాటిలాగే జనశూన్యంగా ఉన్నాయి రోడ్లు. కాని అంతలోకే చీమలబారులాగ మనుషులు రావడం కనిపించింది. మొదట్లో యెక్కడికి వెళుతున్నారో, యెందుకు వెళుతున్నారో తెలియదు. చూస్తూఉండగా ఎక్కడచూసినా జనసమూహాలే. ప్రతివాడూ కలిగినంతవరకూ చక్కగా ముస్తాబయినారు; అంతమందీ ఎందుకో చాలా సరదాగానూ, సంతోషంగానూ కనిపించేరు. ఆడా మొగా, పిన్నా పెద్దా మిలటరీవాళ్లూ, సివిలియన్సూ - అంతమందికీ ఒకటే సంతోషం; ఒకటే ఆనందం - ఊరుఊరంతటికీ యెవడో కనికట్టు కట్టేసినట్టనిపించింది.

న్యూసుపేపరు సౌకర్యాలు అసల్లేవేమో మాకు ... జరుగుతూన్నదీ తుదీ మొదలూ తెలియలేదు. కాని అంతలో ... తట్టింది ఇవాళ పదోతారీకు. పట్నం ఫ్రెంచివాళ్లు హోచిన్ మిన్ సైన్యానికి అధీనం చేస్తారు 9 గంటలకీ అని. ఏ ...

ఏవాడా, చూసినా జాతీయ పతాకాలూ, మందారపువ్వుల్లాగ వెల్లివిరిసిపోయినాయి యిళ్లమీద. ఎర్రటిజెండా, దానిమీద పసుపుపచ్చటి నక్షత్రంన్నూ - అదీ వియట్నామ్ జాతీయ పతాక. దీపావళినాటిరాత్రి, బారులుతీరి ప్రమిదల్లో వొత్తులు వెలుగుతూ ఉంటే వీధులూ, ఊరూ యెంత శోభాయమానంగా ఉంటుందో, అంత జీవం ఉట్టిపడింది హెనోయ్ ఆనాటి ఉదయం.

మెయినురోడ్లమ్మట జనం గుంపులుగుంపులుగా నుంచున్నారు. ఓ చివరనుంచి ఒక్కొక్కపేటా హోచిమిన్‌సిబ్బంది తమ అధీనం చేసుకుని వొప్పచెప్పుకుని వొస్తున్నారు. ఈ తతంగం అంతా చూడ్డానికి కాలేజీ స్టూడెంట్లూ, ఆడవాళ్ళూ - మొగవాళ్లూ - ఊరుఊరల్లా విరగపడిపోతున్నారు. ఎవడిమొహాన్న చూసినా చిరునవ్వే, ఎవరి నోటంటవిన్నా సంతోషం ఉట్టిపడడమే. ఇంత జనంలోనూ ఎక్కడా తోపులాటా, గుద్దులాటా లేదు. ఆడవాళ్లు కంటపడేసరికి, కోరీముందు వరసలో నిలబెట్టి, మొగవాళ్లు వెనకవరసకి తప్పుకునేవాళ్లు.

హో చూ తీ ము ఒ నా మ్ ! !

పదిగంటలయింది. కార్యక్రమం అంతా నియమితం అయినట్టూ జరిగిపోతోంది. "డియన్ బియన్‌ఫూ" యుద్ధవీరులు వొస్తున్నారు. జనంలోకోలాహలం పెరిగింది; సంతోషం పెల్లుబికివొచ్చింది. జయజయధ్వానాలు మిన్నుముట్టిపోయేయి. "హోచూతీము ఒనామ్" (హోచిన్‌మిన్‌కిజై) అన్న కేక యీ చివర ఆరంభించి ఆ చివరకి వెళ్లిందాకా సముద్రపు ఘోషలాగ అలా కెరటాలుగా ప్రసరిస్తూనే ఉంది. బాలభట సమాజాలు, యూత్ లీగువాళ్లు, ...ల సంఘాలు, కార్మిక ఉద్యమాలవాళ్లు - ఎన్నిరకాల సంఘాలూ, ఎన్ని వందలమంది మనుషులూ జెండాలు పట్టుకుని తిరిగేరో చెప్పడానికి వీల్లేదు. నిన్నటిదాకా శుద్ధ శూన్యంగా ఉండే ఊళ్లో రాత్రికి రాత్రి యింతమంది జనాభా ఎలా వొచ్చేరు చెప్మా నేలయీని

నట్టూ అనిపించింది. అంతవరకూ, పాపం, ఎంతభయంతో మూల మూలల నక్కిపోయేరో అనిపించింది.



డి యన్ బి యన్ - ఫూ వీరులకు స్వాగతము

సరిగ్గా టైంప్రకారం 10 గంటలకల్లా 'డియన్ బియన్‌ఫూ' పటాలాలు రా ప్రారంభించేయి. జనం యింకా తండోపతండాలుగా విరగబడుతూనే ఉన్నారు. మొదట్లో లారీలూ అవీ వెళ్లినంత వరకూ మన దేశంలో "పెరేడు డే" లాగే కనిపించింది. కాని అంతకంతకీ ప్రజల ఉత్సాహం మరీ యినుమడించిపోయింది. వేడుక చూడవచ్చిన జనసంఖ్య పెరిగిపోయింది. టాంకులూ, విమాన విధ్వంసక శతఘ్నులు వెళ్లేవేళకి రోడ్లమీద జనం మరీ ఎక్కువయిపోయి, ఇహ అవి వెళ్లడానికి జాగాలే దనిపించేసింది. ముఖ్యంగా ఏంటీ ఎయిర్ క్రాఫ్టగన్ను వెళుతూన్నప్పుడు ప్రజల సంతోషానికి అంతులేకపోయింది. రోడ్డుమీద తొలివరుసలో నుంచున్న ప్రతివాడూ, ప్రతి మిలటరీ పెరేడువాడితోటీ కర లనంచేసేడంటే అతిశయోక్తి కాదు!

సాయింకాలం ఊరు చూడ్డానికి వెళ్లేం. ఏ దసరా, దీపావళీ, సంక్రాంతినాడూకూడా అంత శోభచూడం ఊళ్లో

ఇళ్లల్లో మనుషులు రోడ్లమీదే ఉన్నారు. ఊరిచివరనున్న యెర్రనది వంతెన మొదలు ఆ చివరదాకా ఎక్కడ చూసినా ప్రజే; ఎవడి మొహాన్న చూసినా ఆనందమే. తీవ్రపోరాటంమీద గెలుచుకున్న స్వాతంత్ర్య సంరంభం అంతా వాళ్ల మొహాలమీదా, వాళ్ల యిళ్లల్లోనూ గోచరించింది. ముక్కూ మొహం యెరగనివాళ్లంతా మాతో కరచాలనంచేసి ఫ్రెంచిలోనూ, వియట్నామీజ్ భాష లోనూ ఏదోఅన్నారు. మేమూ యథోచితంగా ఓ వెకిలినవ్వునవ్వి, "చాలా భేషుగ్గావుంది. చాలా సంతోషం" అన్నాం తెలుగులో! ఒక చిన్నవిషయం. డియన్‌బియన్‌ఫూలో యుద్ధానికి వెళ్లి ఆరేడు ఏళ్లాయి ఎడబాటయిపోయిన సోల్జరు అకస్మాత్తుగా తన చెల్లెల్ని చూసేడు ఉదయం పెరేడులో. ఉభయులూ గుర్తించుకున్నారు. మరు నిమషంలో అన్నా చెల్లెళ్లు కౌగలించుకున్నారు. కళ్లు చెమ్మ గిల్లేయి. బాఘా రెండు నిముషాలదాకా వాళ్లకి – ఆ నిర్భర సంతోషంలో – నోటమాట రాలేదు. శిలావిగ్రహాల్లాగ అలా ఉండిపోయేరు. అలాగ యెంతమంది, పాపం, యుద్ధం మూలాన్న ఏళ్లతరబడి యెడబాటయిపోయినారో! ఆనాడు వాళ్లసంతోషం వర్ణించాలంటే ఎవరిచేత నవుతుందీ?

అసలు ఆగస్టు 19, 1945 న వీళ్లు స్వాతంత్రసమరం ఆరం భించిన్నాటికి తుపాకులైనా లేవుట! రైఫిలు పట్టుకుని యుద్ధం చెయ్యడం ఒక్కడికీ చేతగాదు! అలాంటిది క్రమేణా తమ స్వశక్తి వల్లా, స్నేహబలంవల్లా యుద్ధం చెయ్యడం నేర్చుకుని, ఫ్రెంచి వాళ్లని ఓడించి, వాళ్ల తుపాకులూ, మరఫిరంగులూ అవీ లాక్కుని వాటితో మళ్లీ యుద్ధంచేసి – కిందా మీదా పడి – వాళ్ల దేశం వాళ్లు నిలబెట్టుకున్నారు. స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. ...దికాక సంతోషం! ఓ రాత్రిదాకా మా చెవిని పడుతూనే ...ంది జయఘోష: "హోచీమిను ఒనామ్!"

# 4. "దేశమంటే మనుషులోయ్"

ఫ్రెంచివారి అధీనం తొలిగి అక్టోబరు 10 నుంచీ పట్నం జాతీయ నాయకులచేతుల్లోకి వొచ్చింది. పిల్లవాడు నిద్రలేవగానే యిల్లు కళకళలాడినట్టు, తిరిగీ మనుషులు మెసలడంతోనే ఊరికి ఎక్కడలేని శోభవచ్చింది. మరోనాలుగురోజుల్లో స్కూళ్లు తెరిచారు. జనం మామూలుగా యెవరి పనులు వాళ్ళు చూసుకోవడం మొదలెట్టేరు. అంతకుముందు ఆలనాపాలనా లేక గుట్టలు గుట్టలుగా పడివున్న చెత్తా చెదారం అంతా మాయం అయిపోయింది. ఇదివరకటిదాకా ఫ్రెంచివారి హయాంలోఉన్న డాన్సింగు హాలూ, డ్రింకింగు బూతూ మిల్కుబార్సయిపోయేయి. పెద్ద పెద్ద షాపుల్లో సామాన్యులు కట్టుకునే ముతకబట్టలు తాన్లుతాన్లూ వెలిసేయి. ఇవి చాలక యింకా రోడ్లఒడ్డునకూడా అలాంటివే చిల్లరదుకాణాలు! ఏవీధిని చూసినా పుస్తకాలషాపులూ, లైబ్రరీలున్నూ – అన్నీ వియట్ నామీజ్ భాషలోనే!

ఊరూ, దాని సౌకర్యాల మేనేజిమెంటూ అంతా జాతీయ సైనికులు తీసుకున్నారు. పేరుకి మిలటరీ దుస్తులువేసుకుని, తుపాకులు పట్టుకున్నా వాళ్లు యెంతో మర్యాదగా ప్రవర్తిస్తారు. గొప్పా బీదా, చదువుకున్నవాడూ చదువు రానివాడూ అన్న తేడాలేకుండా అందరికీ తోడుపడడానికి ప్రయత్నిస్తారు, పాపం వీళ్లు. వీళ్ల మిలటరీలో మొగవాళ్లెంతమందో అంతమందీ ఆడవాళ్లు ఉన్నారు. ఉభయులూ కలిసి సామరస్యంగా పనిచేసి, ప్రజాహృదయం, అభిమానం చూరగొనడానికి ప్రయత్నిస్తారు.

దానాదీనా పౌరులకీ మిలటరీవాళ్లకీ సౌమనస్యం యేర్పడి[illegible]. తమ జాతీయదళాలూ, వాటిసిబ్బందీచూసి గర్వపడతారు పౌరులు. ఇంచుమించుగా ప్రతిరోజూ ఏదో ఓపేటలో, ఏదో ఓవీధిలో, ఏదో ఓభవంతిలో పౌరులు మిలటరీవాళ్లని సమ్మానం చెయ్యడ[illegible]

మేను ఒక్కొక్కప్పుడు మిలటరీవాళ్లు తమదేశం, తమ ప్రభుత్వం, వారి ఆశయాలూ వీటిగురించి ప్రజలకి బోధచేస్తూ ఉంటారు. అలాంటి సమావేశాలకి స్త్రీలు తప్పకుండా వెళ్లడం పరిపాటి.

దేశస్థులకి తమ నాయకుడంటే ఎంతో భక్తి, గౌరవమున్నూ. ప్రతీ బిల్డింగులోనూ - ముఖ్యంగా పబ్లిక్ బిల్డింగ్సులో - హోచిన్ మిన్ ఫోటో పెద్దసైజుది ఉంటుంది. ప్రతీ యింట్లోనూ చిన్నదో పెద్దదో ఆయన ఫోటో ఉండితీరిందన్నమాటే. బొమ్మల దుకాణాల్లోనూ, పుస్తకాలషాపుల్లోనూ, ఫోటోస్టూడియోస్‌లోనూ అయితే బొత్తిగా మరీని !

అక్టోబరు 10 ని హెనోయ్ తమవశం అయింది. ఆనాటి సాయంకాలం మొదలూ అంతవరకూ వాస్తూన్న సైగాను టైము మార్చేసి, పెకింగుటైముకి సర్దుకున్నారు గడియారాలు. నవంబరు ఒకటో తేదీ సరికయితే బజార్లో హోచిన్‌మిన్ పియాస్ట్రిలేకాని (వీటిని డాంగ్సంటారు), ఇండోచైనా బేంకు పియాస్ట్రిలు పనికి రాకుండాపోయినాయి !



ఉత్తర వియట్నాం కార్మికుల వూరేగింపు

ఇది యిలా ఉండగా ఊళ్లో మాంచి జనసమ్మర్దం అయిన పేటల్లో మూడు నాలుగు పెద్ద కేంటీనులు (షాపులు), పెట్టేరు. వాటినిండా నిత్యజీవనానికి ప్రతివాడికీ ఉపయోగపడే వొస్తువులు - అల్యూమినం గిన్నెలు, టిఫిను కేరియరులూ, తువ్వాళ్లూ, మామూలురకం బట్టలున్నూ. ఇందులో కొంతభాగం చీనాదేశపు సరుకు లేకపోలేదు.

# 5. వియట్నామీజ్ సంస్కృతి

వియట్నామీజ్ ప్రజలు - కొంతమంది ఫ్రెంచి ప్రాబల్యం మూలాన్న మతం పుచ్చుకున్న క్రైస్తవుల్ని తప్పిస్తే - సర్వసాధారణంగా బౌద్ధులు. ఊళ్లలోనూ, యిళ్లలోనూ, విచిత్ర వస్తు విక్రయశాలల్లోనూ బుద్ధవిగ్రహాలు కనిపిస్తాయి. ఐతే అవి మనం హిందూదేశంలోనూ అక్కడా చూసే బుద్ధవిగ్రహాల పోలికగాక, చీనాదేశపు విగ్రహాలని పోలిఉంటాయి.

బౌద్ధ మతస్థులయినా ప్రతివాడూ మాంసం తింటారు. అందులోనూ ఎండ్రపీతలూ, నత్తగుల్లలూ, పాంవులూ సర్వసాధారణంగా తింటారు. కేవలం శాకాహారులు లేరనే చెప్పాలి. ఇహ కాస్త నాగరికత బలిసినవాళ్లయితే కోడీ, బాతూ యిలాంటివి రకరకాలుగా చేసుకుని తింటారు. మనకి వంకాయలాగ యిక్కడ వాళ్లకి ఎండ్రపీత, చేప లేనిదే ముద్ద నోటికి దిగదు!

ఎవ్వడూ - ఎంత పేదవాడయినాసరే - చేత్తో తినడు. రెండు వెదురుపుల్లలతో అన్నం కలుపుకోడం, తినడంకూడా జరుగుతుంది. పేదవాళ్లు వెదురుపుల్లలు ఉపయోగిస్తారు. కాస్త నాలుగు వేళ్లూ నోటికి పోతున్న వాళ్లు ప్లాస్టికు పుల్లలు ఉపయోగిస్తారు.

మన ఆంధ్రదేశంలో దొరికే కూరగాయలన్నీ యిక్కడ దొరుకుతాయి. అరటిపళ్లూ, పంపర పనాసపళ్లూ, అనాసపళ్లూ,

పనసపళ్లూ. అయితే విపరీతం. పనసకాయ ఏం చేసుకోవడమో వీళ్లకి తెలియదు; పండేదాకా ఊరుకుని తొనలు తింటారు. అరటిపువ్వులూ, కాయలూ కూరగాయలబజార్లో విపరీతంగా అమ్ముతారు, ఏటి ఏడాది పొడుగునాను. వేరుసెనగపప్పూ, పంపర పనాసపళ్లూ ఏ రోడ్డుఒడ్డుచూసినా అమ్మే చిరుతిళ్లు.

ఇంకోమాట, భోజనాల ప్రస్తావనలోనే చెప్పాలి. ఇక్కడ యెవ్వడూ - బీదా బిక్కీ కూడాను!—పచ్చి మంచినీళ్లు తాగరు, అన్నం తిన్నప్పుడూ, దాహంవేసినప్పుడూ కూడాను. నీళ్ళకి బదులు పాలూ పంచదారాలేని పచ్చి టీ నీళ్లు పల్చగా చేసుకుని గోరువెచ్చగా పుచ్చుకుంటారు; లేదా "బీరు" తాగుతారు. ఇంటికి యెవరైనా వచ్చినా ఇదే మర్యాద. మనబోటిగాళ్లం ఎవళ్లమయినా "మంచినీళ్ల"ని అడిగితే రోడ్డుఒడ్డునఉన్న దుకాణం నుంచి తెప్పించి లైంజూసో, ఆరెంజిక్రష్షో మరేదో యిస్తారు. మంచి నీళ్ళు మాత్రం పుట్టవ్—ప్రత్యేకించి అడిగితేనేగాని!

## దేవాలయాలు

గుడి అనగానే ఓ కోవెలనీ, అందులో ఓ దేవుఁడు ఉంటాడనీ టక్కున అర్థం అయిపోతుంది మనకి. కాని యిక్కడ అలా కాదు. బౌద్ధదేవాలయాలు (పెగోడా లంటారు) క్వాచిత్కంగా ఉన్నా, ఊళ్లో పేరుమోసెన దేవాలయాలుమాత్రం అవి కావు. ఇక్కడ "లిటరరీ టెంపిల్స"ని ఉన్నాయి; యివి ముఖ్యంగా చైనీస్ లిటరరీ టెంపిల్స్. వీటిలో పురాతనపు చీనా గ్రంథకర్తలూ, వేదాంతులూ వారి బొమ్మలుంటాయి. గుడిలోకి వెళ్ళినవాడు ఊదొత్తులు వెలిగించి, పువ్వులు విగ్రహం కాళ్లదగ్గిర పెడతాడు. "నైవేద్యం" అనే మామూలు యిక్కడ ఏగుళ్లోనూ లేదు; దక్షిణ అంతకన్నాను! పదిమంది గుళ్లోకి ఒక్కసారిగా వెళ్లి ప్రార్థన చెయ్య డానికి వీల్లేదు. (గుడి చూడ్డానికి ఎంతమందైనా వెళ్లొచ్చు మళ్లీను!) ఎవడి మట్టుకు వాడే - ఒకడితరవాత ఒకరుగా వెళ్లి - ప్రార్థన

చెయ్యాలి. ఆడవాళ్లు విగ్రహాలున్న చోటికి (గర్భగుడిలాంటిది) వెళ్లడానికి యెంతమాత్రం వీల్లేదు. చుట్టుపక్కల ఆవరణలో తిరగ వలసిందే, బంతిపువ్వులు కోసుకుంటూనో, బాదంకాయలు ఏరుకుంటూనో! ఒకకుటుంబంగానీ ప్రార్థన చేసుకోవాలంటే ముందర తండ్రి, ఆ తరవాత పెద్దకొడుకూ, ఆ పిమ్మట వాడితర్వాత వాడూ యిలాగ వరసపంపిణీ. ఇంట్లో కూడా పదిమందీ ఒక్కసారి దేవుడి దగ్గిర నిలబడి నమస్కరించి పూజచేసుకోవడానికి వీల్లేదు.

మనలాగే వీళ్లూ నమస్కారంచేసి, చేతులు బొడ్డుదగ్గిరే ఉంచి బాఘా ముందుకి వొంగుతారు. నిటావుగానుంచుని యెవ్వడూ నమస్కరించడు – మనిషికయినాసరే, దేవాలయంలోనైనాసరే. వీళ్లకి సాష్టాంగపడడం తెలియదు.

గుళ్లో గంట వాయించరు. వాయించడానికి గంట ఉండదు. కొన్ని గుళ్లల్లో పాతవి, అంటే యెన్నో వందల సంవత్సరాల పాత గంటలు, జిలుగూ నగిషీపనుల్తో ఉన్నాయిగాని అవి దేవాలయం ప్రాంగణంలోనే ఏ పక్కగానో ఉన్నాయి – కేవలం ప్రదర్శనార్థంన్నూ. అంతేకాని చూరునుంచి ఓగంట వేలాడగట్టడం, గుళ్లోకి వొచ్చిన ప్రతీవాడూ దాన్ని మోగించడంవ్వూ యిలాంటివి ఏంవీలేవు. కాగా గుడిలో ఎంతో నిశ్శబ్దంగా ఉండాలి. గుడి చూపించడానికీ, మనకి నాలుగు సంగతులూ బోధపరచి చెప్పడానికీ వొచ్చిన పెద్దమనుషుల సమేతం అంతా గుసగుసే. భక్తి తాత్పర్యాలతో వొచ్చినవాడు అసలు పెదిమ కదపడు!

గుళ్లోకి వెళ్లినపుడు జోళ్లు తీసెయ్య నక్కరలేదు!

గుళ్లో పూజారీ మనుషులూ అంతా చైనా వాళ్లలా కనిపిస్తారు, ఆ మీసాలూ, ఆ తేలుడుకళ్లూ, ఆ నల్లటికోటూ, షాగా వీటితోను.

మనకి సంస్కృతంలాగ యిక్కడ చీనా భాషకి యెక్కువ మన్నన. దేవుడుగుళ్లల్లో పూజార్లూ వాళ్లూ చీనాభాషే ఉపయోగిస్తారు. ఆ రాతవేరు; దాని సిరావేరు. అచ్చు సిరాలాగ ఉంటుంది.

గుడి కట్టడంలోనూ, ఉంచడంలోనూ కూడా చీనాదేశపు పద్ధతే. అయితే మనలోలాగే వీళ్ళకి మూలవిగ్రహాలూ, ఉత్సవ విగ్రహాలూ ఉంటాయి. ఉత్సవ విగ్రహాలు కర్రతో చేసి లక్కతో రంగులు వేస్తారు. పర్వదినాల్లో వీటినే ఊరేగిస్తారు. దేవాలయంలో అసలు విగ్రహంముందు యీ ఉత్సవ విగ్రహాలని ఉంచుతారు. వాటికి యిటుపక్కా అటుపక్కా పెద్ద నెమళ్లూ, కొంగలూ, హంసలూ ఉంటాయి – యిత్తడివీ, కంచువీన్నీ. పర్వదినాల్లో యివీ ఊరేగుతాయట, ఉత్సవ విగ్రహాల్తోపాటు.

అసలు విగ్రహానికి గర్భగుడికి బదులుగా కర్రతో చేసిన యెత్తైన మండపం ఉంటుంది. దానిమీద చిలవలూ పలవలూ లక్కరంగు చిత్రాలూ కోవెల ఘనతకి తగిన సైజులో ఉంటాయి. లతల పువ్వులూ తీగెలూ అందంగా కళ ఉట్టిపడుతూ కనిపిస్తాయి యీ పనినాటుతనంలో. వీటితోపాటు సర్వసాధారణంగా "డ్రేగన్" కూడా కనిపిస్తుంది యీ శిల్పంలో.

## 6. ఇంటా బయటా!

ఊళ్లో యే యిల్లుచూసినా, వీధి అరుగు అంటూ కనుపించదు, పెద్ద భవనాలు మొదలుకొని సామాన్యపు కొంపల వరకూను. బంగాళాలూ, భవంతులు తప్పిస్తే మామూలు యిళ్లకి రోడ్డుమీదికి వరండాకూడా ఉండదు. ఇళ్లు కట్టడంలో మూడు నాలుగు తరహాలు. పాతబంగాళాలూ, భవంతులూ అన్నీ యూరపుదేశంలో వాటిలాగ అవుపిస్తాయి; కొన్ని కొన్ని చీనాదేశపు వాటిలాగ ఉంటాయి. ఇంకా కొన్ని ఋటీవల కట్టినవి రీ ఇన్‌ఫోర్స్డ్ కాంక్రీటువి అమెరికనుపద్ధతిని అనుకరిస్తాయి. ఇందులో కూడా మూడు వొంతులు ఫ్రెంచివారి ప్రాబల్యం కనుపిస్తుంది.

ఇంక, సామాన్యుల యింటిలోకి వెళితే అంతా యించు మించుగా మనవేపులాగే ఉంటుంది. వాంటింట్లోకి వెళ్లేను. మన వేపులాగ పొయ్యి (మట్టితో వేసింది) లేదు; అలాగని కుంపటీ కాదు. అసలు బొగ్గుల కుంపటి వీళ్లకి తెలియదు. మట్టిపొయ్యికి బదులుగా ముక్కోణంగా ఒక యినపగజంవాంచి ఉంటుంది; దానికి మూడుకాళ్ళున్నా, ఆ కాళ్లమీద నిలబడితే భూమికి బెత్తెడు ఎత్తుకన్నా ఉండదు. అయితే వాంటిల్లు పొయ్యివేసుకున్నచోట అంతా మట్టి! పొయ్యి పాతినచోటకాస్త లోతుగా తవ్వి పుల్లల్తో ఒండుకుంటారు, వీళ్ళు! మనలాగే పీటమీద కూర్చుని వంటింట్లో పనులు చేసుకుంటారుగాని, ఆ పీట రెండు బెత్తలుకన్నా వెడల్పు ఉండదు. కూరా నారా తరుక్కోడానికి అచ్చంగా మనవేపులాంటిదే కత్తిపీట. ఇంక బియ్యంకడుగు బుట్టా, చేటా, జల్లెడా—చీపురుకట్ట సమేతం—మనం వాడుకున్నట్టే వాడుకుంటారు. వాళ్ల వంటిళ్లూ మన వాంటిళ్లలాగే పితపితలాడుతూ ఉంటాయి. ఊః నీళ్ల వాడకంమూలాన్ని వాంటింట్లోకి జోళ్లతో వెళ్ళవొచ్చును. పాంకోళ్ళు అయితే మడే!! వాంటిల్లు యింట్లో వెనకకి మనవేపులాగే ఉన్నా, భోజనాలుమాత్రం వీధివేపు గదిలోనే చేస్తారు. కొన్ని కొన్ని పెద్ద భవనాల్లో డ్రాయింగు రూమూ, డైనింగుహాలూ అని ప్రత్యేకించి ఉన్నా, డైనింగుహాలు వాంటింటి పరిసరాల్లో మాత్రం ఉండదు.

ఇంటినిబట్టి తగిన మండువా ఒకటి ఉంటుంది. అందులో ముఖ్యంగా కనిపించేవి రెండు వస్తువులు (i) పెద్ద నీళ్లకుండీ; (ii) బుద్ధుడు. నీళ్లకుండీలోకి నీళ్ళు చూర్లమ్మట ప్రవహిస్తాయి, వాన పడ్డప్పుడు. (ఇక్కడ విపరీతపు వానలు!) చూరమ్మటే సీనారేకు దొన్నె వుంటుంది. ఓ మూలనుంచి దాన్ని కిందికి గొట్టాంకట్టి యీ నీళ్ల కుండీలోకి వొదిలేస్తారు. బాగా ఓ అ గంటో, గంటో వానపడి, చూర్లమ్మటా పెంకుల్లోనూ ఉన్న దుమ్ము గిమ్మూ అంతా కొట్టుకొనిపోయింతరవాత, యీ క

లోకి నీళ్ళు పడతాయి. కొళాయి నీళ్లకన్నా యీ నీళ్ళు ఎక్కువ ప్రీతితో వాడుకుంటారు. పల్లెటూళ్లో నూతినీళ్ళు వాడతారు. అయితే అవి చపటా కట్టిన నూతులూ కావు; నేల నూతులూ కావు. నూతిగట్టు ఓ అడుగు ఎత్తున ఉంటుంది. కైవారం చాలా చిన్నది. ఆ గట్టున అటోకాలూ యిటోకాలూ వేసి నుంచుని తోడుకుంటారు నీళ్ళు!

బుద్ధుడి విగ్రహం ఓ గోడని గూట్లో ఉంటుంది. సామాన్యంగా యిళ్లల్లో కనబడే ఈ బుద్ధవిగ్రహానికీ అసలు బుద్ధమూర్తికీ ఏపీ పోలిక ఉండదు. రాతిబొమ్మ మాత్రం ఖాయం, - మనవేపు కొయ్యబొమ్మపోలి పిల్లి అమ్మవారై పోయినట్టు! అదే యింటి దేవుడు. మన యిళ్లల్లో మహాలక్ష్మిపీట ఉన్నట్టు, ప్రతీ వియట్నామీజ్ యింట్లోనూ ఈ బుద్ధుడు ఉంటాడు. అయితే మనవేపు లాగ వీళ్ళు ఈ దేవుడికి ప్రతీరోజూ పూజ చెయ్యరు. ప్రతీనెలా (వీళ్ళ పంచాంగంప్రకారం, వీళ్లదీ చాంద్రమానంవే లెఖ్క)ఒకటో తేదీని, పదిహేనో తేదీని పూజచేస్తారు. అంతమందీ ఒక్కసారి పూజచెయ్యడానికి వీల్లేదు. ముందుగా తండ్రో తాతో యింటికి పెద్ద యెరవయితే వారు, దేవుడి ముందు నుంచుని చేతులుజోడించి ముందుకి వొంగి నమస్కారంచేసి ప్రార్థనచేస్తాడు. ఊదొత్తి వెలిగిస్తాడు. పూజకి పువ్వులు ఉండాలన్న బాధలేదు. చేసే పూజ - అంటే పూజ చేసేటప్పుడు అనే ముక్కలు నోట్లో అనుకోవలసిందే కాని, పైకి అనడానికి వీల్లేదు. ఇలాగ ఆయన పూజచేసిన తరవాత పెద్దకొడుకూ, తరవాత రెండోవాడూ అలాగా వొచ్చి ఎవరి మట్టుకు వాళ్ళు దైవధ్యానం చేస్తారు.

ఈ దేవుడు యిలాఉండగా డ్రాయింగురూంలో ఇంకోటి యిలాంటిదే కనిపిస్తుంది. అది కేవలం దేవుడుకాదు కాని, దానికీ పూజా పునస్కారాలూ అదీ జరుగుతూ ఉంటాయి. అది పితృదేవతలని ఉంచేచోటు (Family altar) అంటారు. ఇందాకా చెప్పిన బుద్ధదేవుడికన్నా యిది నిజంగా చాలా బాగుంటుంది

చూడ్డానికి. ఇంటినిబట్టీ, కుటుంబపు ఆర్థికపరిస్థితులనిబట్టీ మంచి చిలవలూ, పలవలుతో పనివాడితనం ఉట్టిపడుతూ ఓ "పాలనెల్లి" లాంటిది లక్కతో కడతారు. దానిమీద నగిషీ చెక్కిన లతలూ, తీగెలూ, పువ్వులూ, కాయలూ, చెట్లూ, పక్షులూ, మృగాలూ అన్నీ వాటి వాటి రంగులతో జిగజిగ మెరుస్తూ ఎంతో బావుంటుంది. ఆ పాలనెల్లిలో మధ్యగా ఒక రెండుమూడు అంగుళాలు వెడల్పూ, ఒకటిన్నరా రెండడుగుల పొడుగూఉన్న దంతపుపలక ఉంటుంది. ఆ పలకమీద ముత్తాతా, ముత్తవ్వ పేర్లదాకా చీనా భాషలో (మనకి సంస్కృతంలాగ వీళ్లకి చీనాభాషంటే ఎంతో గౌరవం!) చెక్కిఉంటాయి. ఆ పలకకి అటూ యిటూ తాత అమ్మమ్మల ఫోటోలు ఉంటాయి. దీని పంపిణీ ఏమిటీ అంటే తండ్రి గతించేసరికి తాత అమ్మమ్మలపేర్లు ఆ పలకమీద ఉన్న లిస్టులో జమ అయిపోయి, యీ గతించిన తండ్రీ తల్లీ ఫోటోలు వాటి స్థానం ఆక్రమిస్తాయి. ఈపని జరిగేముందు కొంత తంతుకూడా ఉంది. కుటుంబానికి చెందినవాళ్లూ, కావలసినవాళ్ళూ పదిమందీ పోగయి "మీ ముత్తాత తాత ఫలానా ఫలానా మంచి పనులు చేసి కీర్తి సంపాదించుకున్నాడు. మీ ముత్తాత ఆయన అడుగుజాడల్లోనే నడిచి ఫలానా ఫలానా ఘనకార్యాలు చేసేడు. మీ తాత ఆ సంప్రదాయానికి బద్ధుడై ఫలానా మోస్తరుగా పైకివొచ్చేడు. మీరుకూడా ఆ విధంగా కుటుంబ మర్యాదల్నీ, ఆనవాయతుల్నీ నిలబెట్టి గౌరవం సంపాదించుకోవాలి. ఆప్రకారం పెద్దవాళ్ళు కమ్మని వారి ఆశీస్సులడగండి" అని చెప్తాడు, అందరిలోకి తల నెరిసినవాడు. ఈ పలకకి యింకో ఉపయోగంకూడా ఉంది. పిల్లాడికిగాని, పిల్లకిగాని నామకరణం చేసినప్పుడు గత ఏడుతరాల్లోనూ ఉన్న పేరు పెట్టడానికి ఎంతమాత్రం వీల్లేదు. అందుకని అప్పుడు యీ పలకమీద పేర్లన్నీ యింకోసారి చదివి తైపారువేసుకుని, అంతవరకూ లిస్టులోకి ఎక్కని పేరు ఏదో పెడతారుట!

# 7. ఆచారాలు

వీళ్లకి కార్తిక, మార్గశిర మాసాలు పెళ్లి ముహూర్తాలకి రోజులు. అయితే మనలోలాగా ఆడపిల్లల తల్లిదండ్రులు ఊః ఆరాటపడి వరుణ్ణి వెతుక్కో నవసరంలేదు. ఇక్కడ ఆచారం వరుడే వధువుని వెతుక్కుంటాడు. పెళ్లి పెళ్లికొడుకు యింట్లోనే జరుగుతుంది! మిగతా కట్నాలూ లాంఛనాలూ అవీ పేర్లమార్పు గాని అంతా మనమోస్తరే.

ఇహ చావూ పుట్టుకలు చూస్తే, మొగపిల్లాడు గనక పుట్టి నట్లయితే యింట్లో వేడుకా, విందూను. ఆడపిల్ల గనక అయిందా, ఏఁవీ లేదు! కాని చదువుసంధ్యల్లోనూ వాట్లోనూ మొగాడెంతో ఆడది అంతే. ఏమాత్రం తేడా లేదు. ఈ భోగట్టా యిక్కడ స్త్రీల గురించి రాసినప్పుడు యింకా విస్తరించి మనవిచేస్తాను.

చచ్చిపోయిన తరవాత మనుషుల్ని పాతిపెడతారు వీళ్ళు. మొదట్లో ఓసారి పాతిపెట్టి తరవాత ముప్ఫైయ్యోరోజున మళ్లీ ఆ అస్థికల్నీ వాటినీ తీసి యింకోచోట మళ్లీ పాతిపెట్టి దానిమీద గోరీ కడతారు. ఈ గోరీలు కిరస్తానపువాళ్ల గోరీల్లాగనూ ఉండవు; తురకవాళ్ల గోరీల్లాగనూ ఉండవు. శివాలయంలో పానవట్టం ఒక్కటీ యింకా పొడిగించికడితే ఎలాగుంటుందో అలాగుంటుంది వాళ్ల గోరీ. మధ్యలో మట్టీ, అందులో చిన్న చిన్న పువ్వుల మొక్కలున్నూ. "తద్దినా"లంటూ వీళ్లకి లేవుకాని, ఆ రోజున కావలసినవాళ్ళు నలుగురూ ఒకచోట పోగయి, ఆ పోయిన మనిషి ఆత్మశాంతికోసం ప్రార్థన చేస్తారు; తరవాత గోరీదగ్గిరకి వెళ్లి ఊదొత్తులు వెలిగిస్తారు. మనిషిని పాతిపెట్టినప్పుడూ, రెండోసారి మళ్లీ భూస్థాపితం చేసినప్పుడూకూడా, అంటే రెండుమాట్లూ, ఆ జాగా ఫలానా యిన్ని పియాస్త్రిలకీ అని కొనుక్కోవాలి. గోరీ కట్టించడం ఖర్చు మెలాగా భరిస్తారు అనుకోండి.

పెళ్లి కానివాళ్ళు (ఆడది అయినాసరే, మగవాడయినాసరే) పోయినట్టయినా, తెల్లటి రంగు వేసిన గుర్రబ్బగ్గీలో, తెల్లటిపెట్టెలో పెట్టి, తెల్లటి గుర్రాన్నిపూంచి, దానిమీద తెల్లటి దుప్పటిలాంటి బట్ట కప్పి తీసుకువెళతారు. జీవికి ఏ విధమైన సంసార పాపంగాని దుఃఖంగాని అంటకుండా నిర్మలంగా ఉంది అనుకోడానికి. పెళ్లి అయినవాళ్ళుగానీ పోయినట్టయినా, పై సరంజాం అంతా నల్ల రంగులో ఉంటుంది. మనిషి పోయిన యింటికి, పన్నెండో నాటి వరకూ నల్లగుడ్డ వేలాడగడతారు. ఏ యింట్లోనయినా, ఏ దుకాణంమీదనయినా చూరునుంచి వేళ్లాడుతూ నల్లగుడ్డకానీ కనిపిస్తే ఆ యింట్లో కొద్దిరోజు క్రితం ఎవరో పోయినారని నిస్సం దేహంగా అనుకోవచ్చు.

## నమ్మకాలూ - సామెతలూ

ఇంక ఒకటిరెండు మాటలు. వీళ్ల నమ్మకాలూ వాటిగురించి రాస్తాను. మనలాగే వీళ్లకి పిచ్చినమ్మకాలు చాలా ఉన్నాయి. అద్దంగనక బద్దలకొడితే వొళ్ల మాలిన ముప్పొట కొంపకి! చేపల పులుసుగిన్నెగానీ చెయ్యిజారి కిందపడితే చెడ్డ ప్రమాదం యింటిల్లిపాదికిన్నీ. బోణీ బేరంగాని చెడిపోతే యిహాను ఆరోజల్లా మరి బేరాలుండవు. మొదట కొనకుండా వెళ్లిపోయినవాడి దృష్టి యింక ఆ దుకాణంమీదే ఉండి మరెవ్వరినీ రాకుండా చేస్తుందిట. అందుకని బోణీబేరం గనక చెడిపోతే, వెంటనే ఓ కాగితం ముక్క నులిమి చుట్టలాగచుట్టి వెలిగించి దుకాణంమీద సరుకులచుట్టూ మూడుసార్లు తిప్పుతారు- ఈపొగ కాస్తా ఆ పాడు దృష్టిని తోలేస్తుందని! ఏదైనా పనిమీద వెళుతూన్నప్పుడు గుమ్మం దిగడం తోటే స్త్రీ కనక ఎదురయిందా భగ్గంపాడే. ముసలివాడు ఎదురు పడితే తక్కున పనిజరుగుతుంది. కుక్కగానీ యెదురుగావొస్తే అంత కన్నా శుభం మరిలేదు! పంచాంగం తప్పకుండా వొంటింట్లో ఉండాలి (దానిమీద చీనా అక్షరాలు ఉంటాయి మరి!)

ఇంక వీళ్ళకి వంటింటివేలుపు ఒక డున్నాడు. వాడి పర్వ దినం డిసెంబరు 27 న జరుగుతుంది. ఏడాది పొడుగునా ఆ దేవుడు వాంటింట్లో కూచుని యింట్లో ప్రతీవాడూ యెవడు యేపనిచేసిందీ చిట్టా రాసుకుంటాడు. వాడికి వాహనం చేప. 27 డిసెంబరు ఉదయాన్నే ఆ వాహనంయెక్కి తిన్నగా స్వర్గానికిపోయి, వీళ్ళ పుణ్యా-పాపకార్యాల లిస్టు అక్కడ దాఖలుచేసి వొస్తాడు. అంచేత యీ దేవుణ్ణి చాలా భక్తితో పూజిస్తారు యీ దేశస్థులు. డిసెంబరు 27 న ఉదయాన్నే మాంచిచేప ఒకాటి బజార్లో కొనుక్కొనివొచ్చి దేవుడిముందు ఉంచుతారు, యింకా తెల్లవారకుండాను. ఎంత మంచిచేప అయితే అంత మంచివాహనం; వాహనం మంచిదయితే దేవుడు సంతోషిస్తాడు. వాడు సంతోషించడంకన్న కావలసింది ఏం వుందీ ? అదీపంపిణీ ! !

వీళ్ళసామెతలు కూడా చాలా చమత్కారంగా ఉంటాయి. మాటవరసకి : (1) "కన్నీళ్ళు ఎప్పుడూ కిందికేగాని మీదికి జారవంటారు. తల్లిదండ్రులకి పిల్లలమీదుండే అభిమానం, పిల్లలకి తల్లిదండ్రులమీద ఉండదని. వృద్ధాప్యంలో తల్లిదండ్రులను పిల్లలు విధిగా పోషించాలని వీళ్ల ఆచారం. ఎవ్వడైనా అన్యథా ప్రవర్తిస్తే వాణ్ణిగురించి అనుకుంటూ "అవునవును. కన్నీళ్లు కిందికే గాని మీదికి జార"వంటారు. (2) కొడుక్కి తండ్రి యింటికి కప్పు లాంటివాడు – తండ్రికన్నా యింకో ఆసరా యెవ్వడూ ఉండడని చెప్పరావడం. (3) "పండు తిన్నప్పుడు చెట్టు నాటినవాణ్ణి తలుచుకోవాలి" – మేలుమరిచిపోకూడదని అర్థం. (4) అన్నం నమిలి మింగాలి; మాట ఆలోచించి ఆడాలి – తొందరపాటు కూడదన్న సందర్భంలో.

# 8. వియట్‌నామ్‌లో పెళ్ళిళ్లు

పూర్వపురోజుల్లో, మన దేశంలోలాగే యీ దేశంలోకూడా పిల్లల తల్లిదండ్రులు తగిన సంబంధాలు చూడడం, పెళ్లిచెయ్యడం ఆచారం. కాని యీ ఆచారం యిప్పుడు చాలా మారిపోయింది. లోగడ మనవిచేసినట్టు, పిల్లగల ఆసామీ పెళ్లిగురించి ఆరాటపడ నక్కర్లేదు. ఈ రోజుల్లో వరుడే వధువుని యెన్నుకుంటాడు. స్త్రీలకి చాలా స్వాతంత్ర్యం ఉండడంమూలాన్నీ కచేరీల్లోనూ అక్కడా యిక్కడా మనుషులు సన్నిహితులు కావడానికి ఎక్కువ అవకాశం. ఆదిలో పరిచయం, తరవాత స్నేహం, ఆపైని ప్రేమించుకోవడం—యీ ప్రాతిపదిక దురూహ్యంకాదు. కాగా, అటువంటి పరిస్థితి ఏర్పడి, కొంత ముదిరిన తరవాత పిల్ల తన తల్లిదండ్రులతో చెబుతుంది. "ఫలానా ఆసామీ నన్ను-పెళ్లి చేసుకుంటా నంటున్నాడు. నాకూ అతనికీ మనసూ మనసూకలిసింది" అని అర్థం వొచ్చేటట్టు. ఆ తరవాత పిల్ల తల్లిదండ్రులు, పిల్లాడి తల్లిదండ్రుల తాలూకు స్నేహితులు యెవరా అని నెతికి పట్టుకుని, వాళ్లద్వారా కొంత సి. ఐ. డి. చర్య జరిపించి పిల్లవాడి భోగట్టా యావత్తూ ఆరా తీస్తారు. అది అయింతరవాత ఓసారి లాంఛనంగా పిల్లవాణ్ని వాళ్ళయింటికి పిలిపించి, అతను చేస్తున్న ఉద్యోగం, అతనికి ఉండే ఆశయాలూ, అభిరుచులూ, ఆర్థికస్తోమతా, మంచీ చెడ్డా అంతా డెబ్భైపుంజీల ప్రశ్నలు వేస్తారు. వాటికి తట్టుకున్నవాడు ఘనుడే! అబద్ధం కనక ఆడితే—ఎంత చక్కగా అబద్ధం ఆడినాసరే—యిట్టే పట్టేసి, ఇహ ఒహటే క్రాసెక్జామినేషను!! అయం విశేషః ఏఁవిటీ అంటే, ఈ ప్రశ్న పరీక్షలో గనక ఏమాత్రం అబద్ధం ఆడేడని తోచినా, ముసలాళ్ల మాట అలా ఉంచి, పిల్ల మళ్లీ ఆ మనిషిని కన్నెత్తి చూడదుట! ఆ సందర్భంలో అబద్ధం ఆడితే అంత అవమానం ఆడపిల్లకి!!

ఇదంతా జరిగి సత్యం అని తోస్తే ఆ పెళ్లి జరుగుతుంది. లేకపోతే జరగడానికి వీల్లేదు. తల్లిదండ్రులమాట తోసిపారేసి "లవ్ మారేజెస్" అంటూ చేసుకున్నవాళ్లు లేకపోలేదుగాని, ఎవరినోటంటా విన్నా అలాంటివి సుఖంగా పరిణమించలేదన్న మాటే.

సరే. ఇంటర్వ్యూలో నెగ్గి పెళ్లి స్థిరపడింది అనుకుందాం. ఇహ పైముచ్చటా, తతంగమున్నూ. వధూవరుల తల్లిదండ్రులు కలిసి ఆలోచించుకుని, పంచాంగం చూపించుకుని మంచిరోజు ఒకటి చూసుకుంటారు. ఆనాడు పెళ్లికూతుర్ని చూడడం అన్నమాట వరుడి తల్లిదండ్రులు. అయితే "యిదే మా అమ్మాయి, పెళ్ళి కూతురు" అని చెప్పరు పెళ్లికూతురికి వొళ్లమాలిన సిగ్గూ మరి. అంచేత "కాస్త టీ అందుకో అమ్మా" అనో "తాంబూలపళ్లెం యిలా పట్టుకుర"మ్మనో పురమాయిస్తారు. ఈనాటి వేడుకని "చాంగో" అని అంటారు. అంటే పెళ్లిచూపులు.

పిల్ల బావుండి నచ్చిందీ అనుకుంటే తరవాత ఘట్టం ప్రధానం (వి ఆన్ హోయ్). దీనికి మళ్లీ పంచాంగం చూపించుకుని (పంచాంగం అంటే చైనా పంచాంగమే), మంచిరోజు నిర్ణయించుకుని మొగపెళ్లివారు లాంఛనంగా పెళ్లికూతురు యింటికి వెళతారు. ప్రధానసమయంలో యిచ్చే వొస్తువులు టీ, ఆకూ, కేకులూ, తమలపాకులూ చెక్కలున్నూ, (పళ్ళు పట్టికెళ్ళరు). ఈ వొస్తువుల కిమ్మత్తు సామాన్యంగా 50,000 పియాస్ట్రిలకి తక్కువ ఉండదంటే, వొస్తువులు ఏ స్కేల్లో ఉంటాయో ఊహించుకోవచ్చు. ప్రధానంనాడు పెళ్ళికూతురు తన స్నేహితులందర్నీ పిలిచి టీపార్టీయో, డిన్నరో యివ్వాలి. ఆవేళ గనక పొరపాటున ఎవరినయినా పిలవడం మరిచిపోతే, పెళ్ళి అయింతరవాత యిహ కాళ్ళావేళ్ళా పడి బతిమాలినా మరి ఆ పిల్ల గుమ్మం తొక్కరు స్నేహితులు. ప్రధానం అయినతరవాత కొద్దిరోజుల్లోనే పెళ్ళి అవాలన్న నిర్భంధం ఏమీలేదు. ప్రధానానికీ, పెళ్లికి, కొద్దిరోజులు

మొదలుకుని కొన్ని యేళ్ళదాకా వ్యవధి ఉండొచ్చు. ఈ మధ్యలో పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ కలిసి సినిమాలకీ, స్నేహితుల యిళ్ళకీ, మీటింగులకీ వాటికీ వెళ్ళవొచ్చు; పెళ్ళికొడుకు పెళ్ళి కూతురు యింటికి నిత్యమూ వొచ్చి కబుర్లు చెప్పుకోవచ్చు. కాని – అంతే!

ఈలోగా పెళ్ళికొడుకుగాని మనసు మార్చుకున్నాడా ఏ చెల్లెలుచేతనో తల్లిద్వారానో కబురు పంపించి ప్రధానం "కేన్సిలు" చేసుకోవచ్చును. ఆడపిల్లగానీ మనసు మార్చుకుందా, ప్రధానంనాడు పెట్టిన వొస్తువుల సొమ్ము మొగపెళ్ళివారికి అచ్చుకోవాలి! కాని, ప్రధానం కేన్సిలు అయిపోయినంత మాత్రాన పిల్లగలవాళ్ళనిగాని, అటు మొగపెళ్ళివారినిగాని ఎబ్బెట్టుగా చూడరు.

ఇహ పెళ్లి. పెళ్లికి మామూలుగా పంచాంగం చూసు కోవడం, మంచిరోజూ, మంచిముహూర్తం నిశ్చయించుకోవడమూ జరుగుతాయి. పెళ్ళి దేవుడిగుళ్ళో ఎన్నడూ జరగదు; అలాగని యింట్లో జరిగే పెళ్లికి హోమాలూ, మంత్రాలూ, సప్తపదులు తొక్కడమూ యిలాంటివేవీ ఉండవు. పెళ్లికి ఒకరోజు ముందుగా మొగపెళ్ళివారు (అంటే వరుడితల్లిదండ్రులు) ఆడపెళ్ళివారింటికి పెళ్లి పెళ్లికూతురికి నచ్చిన "పెళ్లి చీరా" (Wedding Dress) కి యీ పేరు పెట్టేను. వీళ్ళ దుస్తులూ, ఆభరణాలూ వగైరా "వియట్‌నామీజ్ స్త్రీలు" అనే శీర్షికని ప్రత్యేకించి రాస్తాను.) ఆభరణాలూ అవీ యివీ నిర్ణయించుకుంటారు. పెళ్లికి పెట్టే నగల్లో వెండి ఎంత మాత్రమూ ఉండదు. వెండి నగకూడా ఒక నగేనా అంటారు. బంగారం సాధారణంగా 2 మొదలు 5 tael దాకా తూకం ఉంటుంది. ఈ నగలూ, ఆ పెళ్ళిదుస్తులు అన్నీ సాయంకాలానికి వాళ్ళు పెళ్ళికూతురింటికి పంపెయ్యాలి, మర్నాటికి యివి పెట్టు కోడానికి వీలుగా ఉండేటట్టు.

మర్నాడు పెళ్ళి అనగా తొలినాటి సాయంకాలం పెళ్ళి కూతురు తండ్రి ఆమె పెట్టెఅడుగున అంతా సొమ్ముతో నింపెయ్యాలి. పదీ, యిరవై వేల పియాస్ట్రిలు ఉంటేనేగాని సరిపోదు యీ పనికి.

ఇహ పెళ్ళినాడు పొద్దున్నే పురోహితుణ్ని పిలిపించి మంచి ముహూర్తంపు ఘడియలు చెప్పనుంటారు. ఆ ముహూర్తసమయానికి పెళ్లికొడుకుని తీసుకుని మొగపెళ్లివారు పెళ్లికూతురింటికి వొస్తారు. ఆడపెళ్ళివారింటిగేటుకి ఒకఎర్రటిరిబ్బనో, దారంవో కట్టిఉంచుతారు. పెళ్లికొడుకు ఆ దారంక్రిందనుంచి వెళ్లడానికి కొంతసొమ్ము చెల్లించాలి. ఈ ముడుపు (సాధారణంగా వెయ్యిమొదలుకుని రెండువేల పియాస్ట్రిలదాకా ఉంటుంది) ఆడపెళ్లివారి తాలూకువాళ్లలో కాస్త లోటుగా ఉన్నవాళ్ళ కెవరికో పోతుంది. అత్తగారికీ, ఆడపడుచులకీ మాత్రం ఏఁదీ దక్కదు—అటూయిటూ కూడాను. తరవాత రెండుపార్టీలవారూ కలిసి టీ పుచ్చుకుంటారు. అన్నట్టు, పెళ్ళికొడుకు ఆడపెళ్ళివారింటికి రాగానే ఆహ్వానించడానికి బాగా పదిమంది పిల్లామేకా ఉన్న వృద్ధదంపతుల్ని నియామకం చేస్తారు. ఈ వృద్ధదంపతులు ఆడపెళ్ళివారికి సంబంధించి ఉండాలన్న నిర్బంధంలేదు. పెళ్ళికొడుకు ఆడపెళ్ళివారింటికి రాగానే పిల్ల తాతగారికీ, అమ్మమ్మకీ నమస్కరించాలి. ఆ సమయంలో లాంఛనంగా పిల్ల తండ్రి పెళ్ళికొడుక్కి ఏ టైపిన్నో, చిన్న ఉంగరంవో మరేదో చిన్న కానుక యిస్తాడు. పెళ్ళికొడుకు పెళ్ళికూతురియిల్లు చేరుకుని, యీ పనులు చేస్తూంటే ఆడపెళ్ళివారు ఊఃపటాకీలు కాలుస్తారు. తరవాత మొగపెళ్ళివారు లాంఛనంగా అంటారు: "పెళ్ళికి మీ అమ్మాయిని మాతో పంపించవలసింద"ని; అప్పుడు పెళ్ళికూతురు తన స్నేహితులతో వొచ్చి మొగపెళ్ళివా రందరికీ నమస్కరిస్తుంది. పెళ్ళికొడుకు ఆమెతోకూడా వెళ్ళి వాళ్ళ "పితృదేవత"లకి నమస్కరిస్తాడు.

ఆ తరవాత ఆ పెళ్ళికూతురు మొగపెళ్ళివారితో పెళ్ళికొడుకు యింటికి వొస్తుంది. కాని, ఆడపెళ్ళివా రెవ్వరూ ఆమెతో కూడా వెళ్ళరు. పిల్లతల్లిదండ్రులయితే బొత్తిగా వెళ్ళడానికి వీల్లేదు. వాళ్లు యింటో కూచుని ఏడుస్తారు!— పిల్ల పరాధీనం అయిపోయిందిగదా అని. పిల్ల ఇహ బయలుదేరుతుందనగా, తల్లిదండ్రులు ఆమెకి బుద్ధులు చెబుతారు, మొగుడి యింట్లో యెలాగ మెసులుకోవాలోను.

అసలు పెళ్ళికి యిక్కడా - మొగపెళ్లివారింట్లోను పెళ్ళికి బాజాల్లేవు. మంత్రాలూ, తంత్రాలూ, హోమాలూ అలాంటివి అసలే లేవు. ఒస్తూనే ఆ పెళ్ళికూతుర్ని పడకగదిలోకి తీసుకు వెళతారు. అక్కడ ఓ చక్కటి పందిరిమంచం, పరుపూ, సిల్కు తలగడలూ, దోమతెరా యిలాంటి సరంజాం అంతా పిల్లా జెల్లా సంతతి బాగా ఉన్న వృద్ధదంపతులు అమురుస్తారు. అలాంటి వృద్ధ దంపతులు పడక అమురుస్తే, యీ వధూవరులు కూడా పిల్లా మేకాతో చిరకాలం వర్ధిల్లుతారని వాళ్ల నమ్మకం. అంచేత యీ ఎరేంజిమెంటు వృద్ధదంపతులే చెయ్యాలి. పెళ్ళికూతురు రాగానే వీళ్లు ఆమెని ఆహ్వానిస్తారు. పెళ్ళికూతురు శయనాగారంలో ప్రవేశించేముందు కుంపటి దాటాలి, గుమ్మంలోను. అమిర్చిన పక్కమీద కూచోడానికి ఒక్క పెళ్లికూతురికే అర్హత. అప్పటికి యింకా పెళ్లికొడుకు ఆ పరిసరాలకి రావడానికి వీల్లేదు. మరి కాస్సేపటికి పెళ్లికొడుకు వొచ్చి పెళ్ళికూతుర్ని లాంఛనంగా తన పితృదేవతల మందిరానికి (Family altar) తీసుకువెళతాడు. అక్కడ ఉభయులూ నమస్కరిస్తారు. ఆ తరవాత వేళనిబట్టి మధ్యాహ్నం అయితే లంచి, రాత్రయితే డిన్నరూను. అయితే సాధారణంగా యీ విందుభోజనానికి పెళ్ళికూతురు స్నేహితురాలు ఉండడానికి వీల్లేదు. వీళ్లు మళ్లీ తిరిగివెళ్లి పెళ్లికూతురింట్లో (ఆడ పెళ్లివారింట్లో) భోంచెయ్యాలి. ఒకవేళ ఎప్పుడైనా విందుకి మొగ పెళ్లివారింట్లో ఉండిపోయినా భోంచేసి తిన్నగా వాళ్ల వాళ్ల యిళ్లకి

పోడానికి వీల్లేదు. ముందర ఆడపెళ్ళివారింటికి వెళ్ళి, అక్కణ్ణుంచి యెవళ్ళ యిళ్ళకి వాళ్ళు పోవాలి. లేకపోతే తగని అవమర్యాదా చేసినట్టు! సరి. పెళ్ళి అయిపోయింది!

ఇదివరకు పెళ్ళిసమయంలో బౌద్ధాలయానికి (పెగోడాకి) వెళ్లే ఆచారం లేదు కాని, యిటీవల - అంటే సుమారు మూడు నాలు గేళ్ళనుంచీ - యీ ఆచారం కొత్తగా మొలకెత్తింది. పెళ్ళికూతుర్ని తోడ్చుకుని తన యింటికి తీసుకువొస్తూన్నప్పుడు పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ కలిసి దారిలో ఓ పెగోడాకి వెళ్ళి అయిదు నిమిషాలు ఉండివొస్తారు; కాని యిది పెళ్లిలో భాగమ్మా కాదు. ముఖ్యం అయిన అంశమ్మూ కాదు.

పెళ్లిఅయిన మర్నాడు పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ కలిసి "చుట్టపుచూపు" లకి వెళతారు. మొదట పెళ్లికూతురి యింటికి వెళ్లి అక్కడ పెళ్లికూతురు తాలూకువాళ్లందర్నీ కలుసుకుని, ఆ తరవాత పెళ్లికూతురి స్నేహితుల యిళ్లకీ, పెళ్లికొడుకు స్నేహితుల యిళ్లకీ వెళతారు. ఇలా చుట్టపుచూపులకి రమ్మని పెళ్లిఅయిన మర్నాటి ఉదయాన్నే ఆడపెళ్లివారింటినుంచి పెళ్లికొడుక్కి పిలుపు వొస్తుంది.

తీరా చూస్తే పెళ్లికూతురు పెళ్లికొడుక్కి తెచ్చేదల్లా ఓ పందిరిమంచం, దోమతెరా, ఓ రగ్గూ, రెండు తలగడాలూను. తనకిమాత్రం ఓ పదిపదిహేనేళ్ల వరకూ సరిపోయే బట్టలు, రకరకాల దుస్తులు తెచ్చుకుంటుంది. సుమారు వందా, రెండు వందల సెట్సుదాకా ఉంటాయి యివి. జోళ్లు, బాడీసులసమేతం; సర్వమ్మూ వాటివాటికి "మేచ"యి ఉంటాయి, యీ దుస్తులు. పెళ్లికూతురి బట్టలపెట్టె చూస్తే ముచ్చటే!

పెళ్లి వేరూ, కార్యం వేరూ అంటూ లేవు.

ఇంక ఒక చిన్న ముచ్చట మనవిచేసి యీ ప్రసంగం చాలిస్తాను. సుమారు అయిదారేళ్ళ క్రితంవరకూ పల్లెటూళ్ళలో అయిదారేళ్ళ కుర్రాడికి యిరవైయ్యేళ్ల అమ్మాయిని యిచ్చి

పెళ్లిచేసే ఆచారం ఉండేది. ఇల్లూ వాకిలీ చూసేవాళ్లు లేకా, పిల్లాడికి యింకో దక్షత లేకా యిలాంటి పెళ్లిళ్లు జరిగేవి. అయితే పిల్లాడికి యీడు వొచ్చేసరికి భార్యా ముసలిదై పోవడంనుంచి, వాడు తిరిగీ పెళ్లి చేసుకునేవాడు. మొదటిభార్య ఒప్పుకుంటే రెండో పెళ్లి చేసుకోవచ్చు. అది చట్టబద్ధంవే. కాని, యీ అత్యాచారం యిటీవల అంతరించిందనే అనాలి.

# 9. వియట్నామీజ్ వాఙ్మయం

వియట్‌నాం భాషలో వాఙ్మయం రెండువందల యేళ్ల క్రితం లేనేలేదు! ఉన్న వాఙ్మయం కాస్తా యీ గత రెండువందల ఏళ్లలోనూ ఏం వెలువడిందో అదే.

మనదేశంలో సంస్కృతంలాగ, అనాదినుంచీ వీళ్లకి చీనా భాష ప్రాబల్యం ఎక్కువ. అసలు మొదట్లో భావప్రకటన అంతా ముఖేముఖేగా ఉండేది. సామెతలూ, పాటలూ (మన వెన్నెల పదాలూ గొబ్బి పదాల్లాంటివి) ఆ నోటా ఆ నోట అనుశ్రుతంగా వొచ్చేవి. ప్రాచీనపు అముద్రిత వాఙ్మయంలో యీ పాటలూ అవీ ఉన్నతస్థానాన్ని ఆక్రమిస్తాయి; చాలావరకు లిఖితరూపేణా లేక పోవడం మూలాన్ని నశించిపోతున్నాయి.

ఉత్తర వియట్నాం, మధ్య వియట్నాం తాలూకు ఉత్తర భాగం ఒక స్థితిరూపం పొందినప్పట్నుంచీ, వీళ్ళలో చైనాదేశపు సంస్కృతీ, ఆచార వ్యవహారాలూ, బాగా నాటుకుపోయినాయి. 20 బి. సి మొదలుకుని 939 ఎ. డి. వరకూ – అంటే సుమారు వెయ్యిసంవత్సరాలపాటు – పరిపరివిధాల చైనాదేశపు సంస్కృతి ఓ రాజ్యం ఏలేసింది, వీళ్లలో. రాజకీయాల్లోనైతేనేం, మతవిషయాల్లో నైతేనేం, ఆచారవ్యవహారాలలోనైతేనేం, ఎక్కడ చూసినా చీనాదేశపు ప్రాబల్యంవే. అసలు అప్పట్లో వియట్నాం

భాష అంటూ లేదు. వీళ్లు చైనా అక్షరాలు అలవాటు చేసుకున్నారు; చైనాదేశపు పోకడలు భావప్రకటనలో గూడా అనువదించేరు; చదువులుకూడా ఆ దేశంలో మోస్తరే. క్రీ॥ వె॥ 939 మొదలుకుని 19 వ శతాబ్దందాకా చైనాభాష ప్రభుత్వ భాషగా పరిగణించే వారంటే, ఆ దేశపు ప్రాబల్యం సులువుగా ఊహించుకోవచ్చు. ఆ రోజుల్లో యీ భాషలో కవిత్వం చాలా వెలువడింది.

ఇది యిలా ఉంటూఉండగా, 13 వ శతాబ్దం ఉత్తర భాగంలో కొంతమంది వ్రాతభాషలో మార్పు తీసుకువొచ్చేరు. హాన్‌తూయేన్ అనే ఆయన చైనాలిపి తీసుకుని వియట్నాం భాషలో కవిత్వం వ్రాసేడు. తరవాత తరవాత యీ పద్ధతి, అంటే, లిపి చీనాది, భాష వియట్నామీజ్‌న్నూ, — పరిపాటి అయిపోయింది రచయితల్లో. ఆ తరవాత చైనా పదాలకి, కొద్ది మార్పులతో అర్థాలుమార్చి, తమ భాషగా వాడుకునే వాళ్లు — అంటే రాసిన చీనా అక్షరాలమాటకి ఆ భాషలో ఒక ఉచ్చారణా, ఒక అర్థం ఉంటే, వియట్నామీయులు అదే పదాన్ని యింకో ఉచ్చారణతో మరో అర్థంలో వాడేవారు. ఈ మోస్తరుగా 19 వ శతాబ్దంవరకూ చీనా దేశపు ప్రాబల్యం మాత్రం తప్పలేదు.

## ఫ్రెంచి ప్రాబల్యం

అసలు వియట్నాం భాష యిప్పుడు ఉన్నట్టుగా సృష్టించింది అలెగ్జాండ్రద్ డి రోడ్స్ (Alexandre de Rhodes) అనే కాథలిక్కు ఫాదరి. ఈయన ఇంగ్లీషు అక్షరాలు తీసుకుని, వాటికి కొన్ని సాంకేతికాలు ఏర్పరిచి, ఉచ్చారణకి నప్పించి "రోమన్ స్క్రిప్టు"లో యీ భాషని స్థిరంగా నెలకొల్పేడు. ఈయన 1651 లో వియట్నామీజ్ - ఫ్రెంచి డిక్షనరీ రాసేడు. అంతకు ముందు యీ భాషలో డిక్షనరీలు లేవు. మనకి "బ్రౌణ్యాం" లాంటిది, వీళ్లకిది. తరవాత పియేర్ జోసెఫ్ జార్జ్ పిన్యో డి బెహాయిన్

(Pierre Joseph Goarges Pigneau de Behaine) దీనిని 1912 లో యింకా యెక్కువగా సంస్కరించేడు. ఈలోగా అన్నామైట్-లేటిన్ (Dictionnario - annamatico - latinum) డిక్షనరీ 1818 లో రాసేడు. మొట్టమొదట ముద్రణ అయిన డిక్షనరీ యిదే. తబేర్ (Tabere) అనే ఆయన ప్రచురించేడు.

మన రామాయణ భారతాలలాగ వీళ్ల వాఙ్మయంలో వీరి మతగ్రంథాలు ఏంవీ లేవు.

మొట్టమొదట అచ్చుఅయిన పుస్తకాలు వియట్నామీజ్ బైబిలు.

వీరి కవిత్వంలో శృంగారాది యితర రసాలకన్నా కరుణ రసానికి ఎక్కువ ప్రాధాన్యం చిరకాలం బానిసత్వంలో ఉండి పోవడం మూలాన్ని, శృంఖలాలని భేదించుకుని, స్వాతంత్ర్యం సంపాదించాలన్న కోరిక ఎంత మిక్కుటంగా ఉన్నా, బాహాటంగా యీ భావం కవిత్వంలో ప్రకటించడానికి వీల్లేకుండా పోయింది. అంచేత ఏ పంజరంలో పక్షినో కథావస్తువుగా తీసుకుని, తమలోని ఆరాటం వ్యంగ్యంగా ప్రకటించేవారు. "కడుపారా కన్న లేగ దూడలకి ఆవు పాలివ్వలేదు; కాని పరాయిమనుషుల కయితే తప్పనిసరిగా యిచ్చితీరాలి" అని ఓ చిన్న పద్యం. "భరతఖండంబు చక్కని పాడియావు...పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అన్న చిలకమర్తివారి పద్యం జ్ఞాపకం చెయ్యకమానదు.

కొన్ని కొన్ని ఖండకావ్యాల్లో చరణాలు చిరస్థాయిగా నిలిచిపోయి సామెతల కిందకి వొచ్చేసేయి.

కొలనిలో కలవపువ్వు !

పచ్చని ఆకులూ, తెల్లటికలవా, బంగారం కింజల్కం,

బంగారం కింజల్కం, తెల్లటి కలవా; పచ్చటి ఆకులూ

మట్టిలో ఉండి, మట్టిలో పెరిగినా

మట్టివాసన మట్టుకు వాటికి లేదు.

ఇందులో ఉత్తరార్థం సామెతగా నిలిచిపోయింది. ఇలాగ్గానే నిలచిపోయిన మరికొన్ని సామెతలు:—

1. ముసలాళ్లు (పెద్దవాళ్ళు) ఉప్పు యెక్కువతింటే, చిన్నవాళ్లకి దాహం యెక్కువ అవుతుంది. (ఒక్కొక్కరు చేసిన పని తాలూకు ఫలితం వారి వంశం అంతా అనుభవిస్తున్నదన్న సందర్భం).

2. ఉప్పు లేకపోతే చేప చెడిపోతుంది; కట్టుదిట్టం లేకపోతే పిల్లలూను.

3. బూడిదగుమ్మడి అయినా తియ్యగుమ్మడి అయినా, గుమ్మడి గుమ్మడే.

4. కర్రదొలిచి తెప్పకట్టిన తరువాత, దాన్ని కర్రచేద్దాం అంటే మరి సాధ్యపడదు.

లలిత మధురమైన భావాలుగల పద్యాలూ లేకపోలేదు—

ఆకాశంలో వెలిసిందొక చక్కటిమబ్బు
తెల్లటిమబ్బూ, చుట్టూ పచ్చనిదీ
ఓ చక్కటి చానా
నే కొని తేనా
నీకు ?
"బాచాంగ్" బలపపుముక్కలు
కట్టిస్తా కొలనొక్కటి
ఆకాశం రంగునీళ్లూ, పచ్చని తామరాకులూ
నీ బంగారపు పాదపద్మం
ఉంచుదువుగాని అందులో,
ముంచుదువుగాని.

19 వ శతాబ్దంలో వియట్నామీజ్ వాఙ్మయంలో నవలలూ, కథలూ కూడా ("కథానిక"లు కావు) వెల్లివిరిసేయి. అయితే వాటిలో యితివృత్తం చాలావరకూ అద్భుత కల్పనలతో, ఊహా సౌధాలతో నిండి ఉంటుంది. దేవతలూ, వరాలివ్వడం, యిత్యాది

పౌరాణిక కల్పనలు ఎక్కువగా ఉంటాయి. 20 వ శతాబ్దం వొచ్చేసరికి నవలా వాఙ్మయంలోకూడా యెక్కువ ఫ్రెంచి ప్రాబల్యం కనిపిస్తుంది, కాని "సెక్సీ"గా మాత్రం ఉండవు రచనలు, బాల్జక్, గీది మపాసా రచనల్లాగ.

పాతపాటలు అన్నీ, అత్తా-కోడళ్లపోరూ, స్త్రీపాతివ్రత్యం, పురుషుడి ప్రవర్తనలో లోపాలూ యిలాంటివాటికి సంబంధించి ఉంటాయి.

## 10. వియట్నామీజ్ స్త్రీలు

వియట్‌నామ్‌లో మొగవాళ్లకంటే ఆడవాళ్ల జనాభా యెక్కువ. పూర్వకాలపు రోజుల్లో వియట్నామీజ్ స్త్రీలు స్కూళ్లకి కాలేజీలకీ వెళ్లి చదువుకునే ఆచారంలేదు. ఆ రోజుల్లో స్త్రీలు గురుముఖతా యింటివద్దనే చదువు చెప్పుకునేవారు. వాళ్లు నేర్చుకునేది చైనా లిటరేచరూ, వియట్నామీజ్ లిటరేచరున్నూ.

రాను రాను ఫ్రెంచివారి నాగరికతా ప్రాబల్యంమూలాన్న వియట్‌నామ్‌లో స్కూళ్లూ, కాలేజీలూ కూడా వెలిసేయి (ఇండోచైనా యూనివర్సిటీ సుమారు 50 ఏళ్ల క్రితం ఏర్పడింది). అయితే ఆ మొదటిరోజుల్లో ప్రత్యేకించి ఆడపిల్లలకి వాళ్లవాళ్ల బళ్లు ఉండేవి. అంచేత మొగపిల్లలు మొగపిల్లల స్కూళ్లకీ ఆడపిల్లలు వాళ్లగర్ల్స్ స్కూళ్లకీ వెళుతూ ఉండేవారు. కాని యిటీవల కో-ఎడ్యుకేషన్ చాలా ప్రబలింది. ప్రతీ స్కూల్లోనూ, కాలేజీలోనూ కిటకిటలాడుతూ ఉంటారు, విద్యార్థులు—ఆడా మొగానూ. ఆడవాళ్లు ముఖ్యంగా పెడగోజీ, లా, మెడిసినూ చదువుతారు. పెడగోజీకోర్సు యించుమించుగా మన వైపు బి. ఇడి లాంటిది. ఇది ప్యాసయితే మాష్టరు గిరీ చెయ్యవొచ్చును. ఎక్కువమంది యీ సబ్జెక్టు తీసుకుంటారు; తరువాత

ఎక్కువమంది స్త్రీలు తీసుకునే సబ్జెక్టు వైద్యం. "లా" చదువుకున్న ఆడవాళ్లూ లేకపోలేదు గాని ప్రాక్టీసు చేస్తున్న ఆడలాయర్లు మాత్రం చాలాకొద్దిమందే— అయిదారుగురుకంటే లేరు.



పదహారూ - పద్ధెనిమిది సంవత్సరాలకి ఆడపిల్లల పెళ్లి యీడు సాధారణంగాను. అయితే ఒక్క చిన్న విశేషం ఏఁవిటీ అంటే ఆడపిల్ల పెళ్లికి సంగీతం వగైరాలు వొచ్చి ఉండాలన్న యిబ్బంది లేదు. "మీ అమ్మాయికి సంగీతం వొచ్చునా?" అన్న ప్రశ్న పెళ్లిచూపుల్లో అసలు రానేరాదు. ఇహ పెళ్లికూతురికి ఉండవలసిన ముఖ్యమయిన క్వాలిఫికేషన్సు ఏఁవిటీ అంటే —— పిల్ల బాగా వొండుతుందా ? కుట్టుపనీ, ఎంబ్రాయిడరీపనీ వొచ్చునా ? సంసారం పొదుపుగా చేస్తుందా ? యిత్యాది - వీటిలో వంట నేర్చిఉండడం చాలముఖ్యం. గొప్పగొప్పవాళ్ల యిళ్లల్లో, వంట మనుష్యులు ఉన్నప్పటికీ, విందు సమయాల్లోనూ, యితరత్రా అతిథులు వొచ్చినప్పుడూ తప్పకుండా ఆడపిల్లలచేత వండించి, 'యీ కూర మా అమ్మాయి చేసిం'దనో, 'ఆ పులుసు మా ఆవిడ

కాచిందనో గొప్పగా చెప్పుకుంటారు. అలా యింటి ఆడంగులు చేసిపెట్టడం అతిథులకి ఓ మర్యాద.

స్త్రీలకీ చిత్రలేఖనానికీ చాలా దూరం వియట్నాంలో.

ఇక్కడి స్త్రీలు—ముఖ్యంగా గొప్పయింటిపిల్లలు కొద్దో గొప్పో సంగీతం నేర్చుకోవడం యిటీవల పరిపాటి అయింది. చాలా మంది పియానో వాయిస్తారు. మరికొంతమంది ఫిడేలు వాయిస్తారు. కాని యీ సంగీతం మొత్తంమ్మీద చూస్తే, మనవేపులాగ ఖచ్చితంగా నేర్చుకున్నదిమాత్రం కాదు; పెళ్లిముందర సంగీతం అసలే కాదు! సొసయిటీలో మెరుగుకే!

వియట్నాంలో ఎంతోమంది, పెళ్లి చేసుకోకుండా ఉండిపోయిన ఆడవాళ్లు ఉన్నారు. ఇలాంటివాళ్లు ఊః చదువులతోనూ, లేదా విద్యాబోధ చేస్తూనో కాలం గడుపుతారు. జీవితంలో ఏదో పెద్ద ఆశాభంగంవల్లనో, లేకపోతే యితరకారణంవల్లనో, యింకేమీ అనుభవించతగ్గది కనపడక, యిలాగ చదువుల్లో నిమగ్నులయిపోయేరు వీళ్లు.

ఆడవాళ్లు ఆఫీసుల్లో పనిచెయ్యడం పరిపాటి. పెళ్లయిన వాళ్లుకూడా కచేరీల్లో పనిచేస్తారు. ఏంవీ యెబ్బెట్టుగా ఉండదు సంఘంలో.

మొగాళ్లకన్నా ఆడవాళ్లకి తెలివితేటలు ఎక్కువఅంటారు, ముఖ్యంగా వర్తకంలో. అంచేతే సాధారణంగా ప్రతీ ఆడదానికీ ఒక షాపు ఉంటుంది. పురుషులు కచేరీల్లో ప్రాకులాడుతూ ఉంటే స్త్రీలు యింటివద్ద షాపుల్లో వర్తకం చేస్తారు. మొత్తంమ్మీద ఆడదాని ఆర్జనే హెచ్చుగా ఉంటుంది. కాగా, కర్చువెచ్చాలలో ఆడది మహాగడుసు! ఇంటిపెత్తనం అంతా ఆడదానిదే. పురుషుడు తను సంపాదించింది కాస్తా తెచ్చి స్త్రీ చేతుల్లో పెడతాడు; ఇహ మేనేజిమెంటు అంతా ఆమెదే. పురుషుడు ఎంతమాత్రం యింటి వ్యవహారాల్లోను—ముఖ్యంగా కర్చువెచ్చాల్లో—కలగచేసుకోడు. (పురుషులు మహద్విషయాలు ఆలోచించాలిగాని, యిల్లా కర్చు

అదీయిదీ— యీ ఊబిలో పడిపోకూడదంటారు వీళ్లు !) అలాగని ఆడది దూబరాకర్చు చెయ్యదు సాధారణంగాను. పుట్టింటివారికీ పెట్టెయ్యదు. ఎప్పుడయినా అటువంటి సందర్భం తటస్థించి, తనవాళ్లకి సహాయం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడినట్టయితే, భర్తఅనుమతి తీసుకుని మరీ వ్యవహరిస్తుంది.

కాని ఒక్కొక్కప్పుడు — ముఖ్యంగా ధనికుల యిళ్లల్లో యీ పద్ధతివల్ల ముప్పే వొస్తూ ఉంటుంది, పాపం. గొప్పవాళ్లకి పనిలేకపోగా తీరుబాటు ఎక్కువయిపోవడం మూలాన్ని, నలుగురు ఆడవాళ్లూ ఓచోటచేరి జూదం ఆడతారు. ఈజూదాన్ని మెజోంగ్ (Majong) అంటారు. ఇది యిలా ఉండగా దేవుడి పేరుతోనూ, పెద్దమ్మ పేరుతోనూ వీళ్ల దగ్గిర సొమ్ముహరించే వాళ్లూ లేక పోలేదు. "నీకు చాలా గడ్డురోజులివి; దీనికి తగిన ప్రతిక్రియ జరిగించకపోతే సర్వనాశనం అయిపోతుంద'ని ఓపలుకు పలుకు తాడుశకునపక్షి, పురోహితుడు-దాంతో యిల్లాలు ఊరి దుస్తులూ, నగలూ కొనడం ఆరంభిస్తుంది. తరువాత చక్కగా ముస్తాబు చేసుకుని గుడికి వెళుతుంది. అక్కడ కొంతమంది వాయిద్యగాళ్లు ఉంటారు - దేవుడిముందు వాళ్లు వాయిస్తూ ఉంటే యీమె నృత్యం చేస్తుంది. శివాలేసినట్టు చుట్టూ ఓ వందమంది మూగి యిదంతా చూస్తూ ఉంటారు. ఆ వాయిద్యగాళ్లకి బోలెడు సొమ్ము యివ్వాలన్నమాట అలా ఉండగా, యీ చుట్టూమూగిన వాళ్లమీద సొమ్ముజల్లి పారెయ్యాలి (దిగదుడుపులాగ)! ఎంత సొమ్ము వెదజల్లితే అంత భక్తి తాత్పర్యాలలో యీ ప్రక్రియ చేసినట్టు - దీనికి లెండంగ్ (Len Dong) అని పేరు.

ఈ దేశంలో విధవాపునర్వివాహం కొత్తకాదు; విడాకులూ కొత్తకాదు. ఎటొచ్చీ విడాకులివ్వడం అంత తేలికయిన విషయం మాత్రంకాదు. సాధారణంగా మధ్యవర్తులు రాజీ కుదర్చడానికి ప్రయత్నిస్తారు. కోర్టు ప్రొసీడింగ్సు కయితే రెండు మూడేళ్లకి తక్కువ పట్టదు. ఏది యెలాగ ఉన్నా, విడాకులు యిచ్చిన ఆడ

దాన్నిగాని, విధవనిగాని సంఘంలో యెబ్బెట్టుగా చూడరు. వీళ్లకి తిరిగీ పెళ్లిళ్లుకూడా సులభంగానే జరుగుతాయి. అలాంటి పెళ్లిళ్లని ఎంతమాత్రం యీసడించరు సరికదా, 'తోవలో.దొరికిన పువ్వు, చెట్టున తెంపింది కాకపోయినా దొరికినవాడికి కొత్తదే' అని సంతోషిస్తారు! (ఇది వియట్నామీజ్ సామెత.)

ఫ్రెంచివారి హయాంలో పడుపువృత్తి బహుప్రబలంగా ఉండేది. ముఖ్యంగా అమాయికపు పల్లెపడుచులు యీ దుర్వ్యాపారానికి చాలా గురిఅయ్యేవారు. అయితే యిటీవల స్త్రీలలో "వేశ్యావృత్తి నిరోధన"సంఘం ఒకటి బయలుదేరి ఎక్కువగా పనిచేస్తోంది.

వియట్నాం స్త్రీలు పొడవుగా (Conical) ఉన్న గడ్డి టోపీలు వాడతారు. లోపల బాడీసూ, దానిమీద కబ్బా, దానిమీద మునుకులు దిగేదాకా ఉండే పొడుగాటి "జాయి"స్నీ కాళ్లకి పంట్లాలు తొడుక్కుంటారు. వీటికి జేబులుండవ్. నడుందగ్గిర "ఎలాస్టిక్ బేండు" ఉంటుంది. కొద్దిమంది, నేటి చైనాలోలాగ, పాశ్చాత్యదేశపు దుస్తులు వేసుకునేవాళ్లూ లేకపోలేదు, అక్కడక్కడ. వీళ్లందరికీ సర్వసాధారణంగా మునుకులవరకూ వేలాడుతూ ఉంటుంది జుట్టు. కాని, ఏకొద్దిమందో తప్ప జడవేసుకోరు. మామూలుగా కిందకి దువ్వుకుని, మధ్యన ఓ "క్లిప్పు" తగిలిస్తారు. చాలామంది బాబ్ జుట్టు ఉన్నవాళ్లూ ఉన్నారు. కాని యెవ్వరూ తల్లో పువ్వులుమాత్రం పెట్టుకోరు. జోడులేకుండా ఆడది కాలు నేలమోపదు. ఇంట్లో పాంకోళ్లు వాడతారు.

ఆడవాళ్లు నిరభ్యంతరంగా మాంసం తింటారు.

మొగవాళ్లకంటె ఆడవాళ్లు (ముఖ్యంగా పల్లెటూరివాళ్లూ, ముసలివాళ్లూను) కారాకిళ్లీ వేసుకుంటారు. ఈ దేశపు తమలపాకులు పెళుసుగా, కారంగా, మన "బెంగాలీ ఆకు"ల్లాగ ఉంటాయి. వీళ్లు వెదురుబొంగుతో చేసిన "హుక్కా" కూడా కాలుస్తారు, గొప్పయింటి ఆడవాళ్లయితే సిగరెట్లున్నూ.

పళ్లకి "కప్పు" (నల్లటిరంగు) వేసుకోవడం అనాదినుంచీ ఆచారం. కప్పు వేసుకుంటే పళ్లు పుచ్చిపోకుండా, గట్టిగా ఉంటాయిట. ఈ ఆచారం నవయువకులలో నశించిపోయింది కాని: పల్లెటూళ్లలో యింకా ప్రబలంగానే ఉంది.

కాలం గడిచి, కష్టసుఖాలు వంటనాటి, ఏళ్లు పైబడుతూ ఉంటే, వీళ్లు "డిక్వీ" అని ఓ నియమం పడతారు. ఈ నియమం పట్టిన ముసలాళ్లు మాంసం తినరు. ఎంతసేపూ సాత్విక ఆహారం పుచ్చుకుని, కోవెలకి వెళ్లి ప్రార్థనలుచేస్తూనూ భక్తితాత్పర్యాలతో కాలంగడుపుతారు.

ముఖ్యంగా చెప్పవలసింది స్త్రీల ధైర్యసాహసాలు. వియట్నాంసేనల్లో మొగవాళ్లు ఎంతమందో ఆడవాళ్లు అంతమందీ ఉన్నారని లోగడ మనవిచేసేను. స్త్రీలు మిలటరీలో చేరి పురుషులతోపాటు, టేంకులూ, ఫిరంగులూ అవీ ఉపయోగించి యుద్ధంచేసేరు; చేస్తారు. గెరిల్లాయుద్ధంలో ఆరితేరిన చెయ్యి ఆడది. పురుషులతోపాటు సరసననుంచుని, కవాతుచేసి, కాయకష్టపడి పనిచేస్తారు స్త్రీలు. ఆడా మొగా, కలిసి సరసని పనిచేస్తున్నప్పుడూ, యుద్ధాల్లోనూ, కేంపుల్లోనూకూడా ఎంతో కలిసి మెలిసి ఉంటారు. కాని ఏవిధంగానైనాసరే ఏమాత్రం హెచ్చుతగ్గు వచ్చినా వెంటనే తుపాకితో కాల్చెయ్యాలని మిలటరీలో రూల్సుట. అంచేత శీలానికి లోటురాదు. మిలటరీలో పనిచేస్తున్నా, పెళ్లి చేసుకోవాలంటే నిరభ్యంతరంగా చేసుకోవచ్చును. వియట్నాం మిలటరీలో పురుషుడంటే ఎంత విలువో స్త్రీకి అంతకన్నా ఎక్కువ తాహతూ విలవా అంటే అతిశయోక్తి కాదు!

(10-11-54 సంచికనుండీ "హనోయ్ విశేషాలు" రచిస్తున్న శ్రీ కొవ్విడి లక్ష్మన్నగారు ఇండోచైనాలో యుద్ధవిరమణ పర్యవేక్షణకుగాను వెళ్లిన ఇంటర్నేషనల్ కమీషన్ తాలూకు సెక్రటేరియట్‌లో పనిచేశారు.)

అందరి జాతకాలూ చూస్తూఉంటే, యెందుకో నా జాతకంవూ చూసుకోవా లనిపించింది మరోమాటు. జనవరి 13 తో గురుమహాదశలో షష్ఠమాధిపత్యభాగం అయిపోయి నవమాధిపత్యభాగం ఆరంభిస్తుంది. కాస్త మనస్సుకి శాంతీ, తృప్తీ కలగాలి అప్పట్నుంచీని. ఇది జనవరి 10 వ తేదీ రాత్రి పన్నెండుగంటలు దాటేక అనుకున్న మాటలు. 12 వ తేదీ ఉదయాన్ని 11 గంటల కల్లా కారణం వీరణం లేకుండా ఆఫీసులో పని ఒత్తిడి సర్దుకుంది. ఆవేళ సాయింకాలానికి మేము ఫలానానాడు ప్లేనులో వొస్తున్నామనీ, కాంబోడియాలో మమ్మల్ని రిసీవు చేసుకోడానికి యేర్పాట్లూ, వసతీ - భోజనపు సౌకర్యాలూ అవీ జరిగించవలసిందిగా టెలిగ్రాం కూడా వెళ్లిపోయింది. 13 వ తేదీని కచేరీలో పని ముట్టుకుంటే ఒట్టు! అదంతా మర్నాటి ప్రయాణం సరదాన్నూ.

పధ్నాలుగు సంక్రాంతి ఆవేళే నా ప్రయాణంన్నూ. "పీరు సాయిబూ గోకులాష్టమి" అన్నట్టు యీ ఊళ్లో పండుగా పబ్బంవూ యెలాగా లేవు, పోనీ ప్రయాణమే బావుంది అనుకున్నాను. తొలి నాటి రాత్రి ఒంటిగంటదాకా ఏవో కబుర్లు చెబుతూ కూచున్నా, ఆవేళ నాలుగింటికే లేచేను. మొహం కడుక్కుని, ఆహ్నికాలు తీర్చుకుని, క్షవర కళ్యాణం అదీ కానిచ్చే సరికి అయిదుగంటలయింది. నౌకరు వేడి వేడి కాఫీ పట్టుకొచ్చేడు. మరో అర గంటలో స్నానానికి వేన్నీళ్లు అమిరేయి. ఆరింటికల్లా బ్రేక్ ఫాస్టు అయింది. అప్పటికప్పుడే కారువొచ్చి వాకిట్లో నిలుచుంది. ఆరున్నరకి హానోయి ఎయిరోడ్రోం చేరుకున్నాం. వూలుసూటూ,

మఫ్లరూ, ఫెల్టూ —ఎన్ని తొడుగులు తొడిగినా చలిబాగా వేస్తూనే ఉంది. ఏడుగంటలకి ప్లేను బయలుదేరింది.

పదిగంటలకల్లా వియన్‌సియన్ (లావోస్)విమానాశ్రయంలో దిగేం. అయిదు నిమిషాల్లో వీపు చుర్రుమంది. ఊఁ ఎక్కడ చూసినా ఎర్రగాఘూళి, నాటుకోళ్లున్నూ, అంతలో ఢమఢమ లాడుతూ డోలు చప్పుడూ బాజాలున్నూ. ఆవేపుకి చూచాను. పేపరుబండి, ఏదో సినీమా ఎడ్వరుటయిజుమెంటు. రెండెండ్లబండికి (అచ్చంగా మనవేపు లాంటిదే, నాగపూరు ప్రాంతంలో లాగ చిన్నచక్రాలూ పల్లంగా ఉండేబండీకాదు) గూడుతీసేసి, నాలుగు వేపులా సినీమా బొమ్మల చిత్రాలుపెట్టి, నాలుగుమూలలా అరటి చెట్లూ, వాటిమీంద కొబ్బరి బొండాలతో మట్టలూ, ఆ మధ్యన బాజాలున్నూ, బ్యాండు మేళవో, సన్నాయి మేళవో అయితే ఆమాటే రాసేవాణ్ణి; కాని అలాంటిది ఏదీ కాకపోవడంవల్ల "బాజాలు" అన్నాను. మా విజయనగరంలోకూడా సినీమా ఎడ్వరుటయిజుమెంటు యింతకన్నా ఎన్నోరెట్లు నాజూకుగా ఉంటుంది అనిపించింది. ఎయిరోడ్రోము పరిసరాల్లో అటూయిటూ పచారుచేస్తూ రోడ్లమ్మట సైకిళ్ళమీందా రిక్షాలలోనూ (వీటికి సిక్లో అంటారు) పోతున్న వాళ్లసైఖరీ చూస్తేకూడా ఏంవీ మనస్కరించలేదు. చాలా వెనకబడ్డ జాతిలాగ అవుపించింది. ఏదయినా సరే ఊళ్ళోకి వెళ్లి నాలుగు పరిస్థితులూ తప్సీలుగా చూడనిదే నిర్ధారణ చెయ్యకూడదు అనుకున్నాను. అంతలో టైము అయిపోయింది; మళ్లీ ప్లేనుయెక్కి కాంబోడియా ప్రయాణం సాగించేం.

అంతఎత్తున ఆకాశంలో యెగురుతున్నా ఊలుకోటు దుర్భరమే అనిపించింది. దిగువగా చూస్తే ఎర్రనియెండ కొండచరియల మీందపడి, లోయల్లో చెట్లకీ ఆకులకీ మంజుల శబలవర్ణం ఆపాదిస్తోంది. అక్కడక్కడ పల్లెటూళ్లు, బొమ్మలకొలువులో యిళ్ల లాగ కనిపించేయి. లావోస్—కాంబోడియాలనికలిపేరోడ్డు ఎర్రగా ఓ జేగురుగీతలా ఉంది. ఇండోచైనా మొత్తంమ్మీద ఒక్కటే

ఒక్క రైల్వేలైను. అదైనా నేరోగేజి అగ్గిపెట్టెలబండీ. అల్లంత దూరాన్న చిలక సముద్రంలాంటిది ఓ పెద్ద సరస్సు. అందులో నుంచి బయలుదేరి మీకాంగునదిని వెతుక్కుంటూపోయే ఉపనదిన్నీ - మెలికలు తిరిగి, ఎండలో మిలమిలా మెరిసిపోతూ ఉంది. కొండ చరియల్లోనూ, యితరత్రా భూమ్మీదా దట్టంగా పెరిగిన అడవులు.

పన్నెండింటికి "లంచి" యిచ్చింది, ఎయిర్ హోస్టెస్. అది పుచ్చుకుని కాస్సేపు కన్నుమూసేం. అంతలో ఏఁవిటో కుదిపినట్టయింది. కన్నువిప్పేసరికి "నో స్మోకింగు" బోర్డు వెలిగింది. మరో అయిదు నిమిషాలకి బాగా కిందికి దిగిపోయింది, ప్లేను. "నాంపెన్" ఎయిరోడ్రోం రానే వొచ్చింది. కాంబోడియాలో కాలుపెట్టేం!

## నాంపెన్‌లో పొంగల్!

ఎయిరుపోర్టుకి వొచ్చిన స్నేహితులతో కలిసి "కాంబోడియా హోటలు" చేరుకున్నాం. కాస్సేపు విశ్రమించి, మధ్యాహ్నం టీ పుచ్చుకుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటే ఎవరో గదితలుపు తట్టేరు. తిరిగి చూతునూ? పట్టుపరికిణీ, గులాబిరంగు సిల్కు జాకెట్టూ, మెడలో సన్నని ఒంటిపేట బంగారపు గొలుసూ, చెవులకి దుద్దులూ - దక్షిణాది పిల్ల! పన్నెండు పదమూడేళ్ళుంటాయి. ఇంకా ఆ అమ్మాయి గది గుమ్మంలో అడుగు పెట్టకుండానే "వా అమ్మా, వా" అంటే "వా, అమ్మా, వా" అని ఒకటేగోల పెట్టేసేను, నాతోకూడా ఉన్న స్నేహితులు ఉత్తరక్షణంలో నావేపు తిరిగి "ఇవళికట ఫ్రెంచిలో పేశిరుంగో సార్" అని ఒకరూ, "ఆర్ ఇస్ తెలుగూ" అని మరిఒకరూ, మరి ముక్కతోచనిచ్చేరుకాదు, ఆ అమ్మాయి ఎవరో నాకు పరిచయఁవ్వూ చేసేరుకాదు - వాళ్ళ ఆనందంలోను. ఆ రెండు ముక్కలు ఫ్రెంచిలో అనేసరికి ఆ అమ్మాయి అచ్చంగా తెలుగుపిల్లని తేలిపోయింది. ఇహ మా సంతోషానికి అంతంలేదు. ఆ అమ్మాయి వడలూ,

పొంగలి, చిన్న టిఫిన్ కారియరులో పెట్టి తెచ్చింది. అందరికీ పంచి యిచ్చింది. అది ఫలహారంచేస్తూ, మేం బక బకమని కబుర్లు చెప్పుకుంటూ ఉంటే, మిగతా నలుగు రైదుగురు స్నేహితులూ నవ్వుతూ కూచున్నారు, మధ్య మధ్య "వీరు పెద్దగారు. వారు ఫ్రెంచిమాట వచ్చితుంది" లాంటి తెలుగు మాట్లాడుతూను.

ఆ సాయంకాలం వాళ్ళింటికి రమ్మంటే వెళ్లేం. ఆయన ఓ పేరుపడ్డ ఫ్రెంచి ప్రొఫెసరు — ప్రొఫెసరు వెంకట అని. పారిస్‌లో డాక్టరేటు పుచ్చుకుని, ఇండియాలో ఫ్రెంచి టెరిటరీలో పనిచేసి, వాళ్లప్రభుత్వం యెన్నికచేసి పంపితే కాంబోడియా వొచ్చేరు. ఆ దేశంలో నా స్నేహితులు నలుగురే దాక్షిణాత్యులవడంవల్ల, ఆ కుటుంబానికీ వీళ్లకీ ఎంతో చనువు ఏర్పడింది. ప్రొఫెసరు వెంకట, వారి శ్రీమతులూ కూడా స్వచ్ఛమయిన తెలుగువాళ్ళు. ఇంటిదగ్గిర తెలుగుమాట్లాడతారు; యింట్లో ఓ దేవుడుగదీ అదీ ఏర్పాట్లు మన మోస్తరుగానే. నేను తెలుగువాణ్ణి అని చెప్పేసరికి, వాళ్ళ మొహాలు చేటంత అయినాయి. ఈమధ్య పరాయిభాషేగాని మనమాట మాట్లాడుకోడానికి నోచుకోని నాకూ కొండ అందుకున్నట్టే అనిపించింది. రాత్రి ఎనిమిదిన్నర దాటినా యింకా ఆవిడతో కబుర్లు చెబుతూనే కూచుండిపోయాను. వాళ్ళఅమ్మాయి రేడియోగ్రాంలో కర్నాటక సంగీతం రికార్డులు పెట్టి భరతనాట్యంచేసింది, ముద్దులొలుకుతూను. ఆ తరవాత షరబత్తూ, సిగరెట్లూ అవీను. మా వాళ్ళు చెప్పేరు, ప్రతీ పండుగకీ పబ్బానికీ వీళ్లనిపిలిచి ఏదోచేస్తూనేఉంటారుట వెంకట గారి కుటుంబం. ఈసారి ఫలితం నాకు దక్కిపోయింది!

## ఊ రూ - వా డా

నాంపెన్ పట్టణం అంతాకలిపి యించుమించుగా కాకినాడ అంతవుంటుంది. (ఇంకా కొంచెం చిన్నదేనేమో కూడాను). ఒకప్రక్క ఫ్రెంచి అధికారుల బంగాళాలు, కచేరీలూ, పెద్ద పెద్ద

హోటేళ్లూ వాటితో, నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఎంతో నీటుగా ఉంటుంది. మరోవైపు చీనావాళ్ల దుకాణాలూ, చిల్లర బజార్లూ, దిక్కుమాలిన కొంపలతో పెద్దమ్మ తాండవం ఆడుతూ అసహ్యంగా ఉంటుంది. ఒక్కసారి ఊరు నాలుగుమూలలా కలియతిరుగుతే టక్కున చెప్పొచ్చు — యిక్కడ అంతా మరీ గొప్పవాళ్లో, లేకపోతే బాగా బీదవాళ్లోగాని మిడిల్ క్లాస్ పీపిలంటూ లేరని. ఈమాట నిజమేనట్ట కూడాను.

కాగా చిత్రం ఏమిటీ అంటే, కాంబోడియా దేశానికి ముఖ్యపట్నం అన్నమాటేగాని, నాంపెన్‌లో కాంబోడియన్నుకి ఎందులోనూ స్థానం ఉన్నట్లు కనిపించదు, పాపం శ్రమ వాళ్ళదీ, డబ్బు పరాయి వాళ్లదీలాగ తోస్తుంది. పేరుపడ్డ పెద్ద హోటేళ్లన్నీ ఫ్రెంచివాళ్లవో, చైనావాళ్లవోను. పెద్దపెద్దషాపులన్నీ చైనా వాళ్లవీ, వియట్నామీయుల విన్నీ. ఇంకాకొన్ని ఇండియన్ షాపులు, బేంకులు ఫ్రెంచివాళ్లవీ, చైనావాళ్లవిన్నీ — పేరుకి ఒక్క కాంబోడియన్ బేంకు ఉంది, రెయిల్వే గేడులో ఫ్లేగ్ స్టేషనులాగ! స్కూళ్లలోనూ, కాలేజిల్లోనూ, కచేరీల్లోనూ అక్కడక్కడ తగు మాత్రంగా కాంబోడియన్ను ఉన్నారుగాని, చాలాకొద్దిమంది. వీథుల్లో సైకిళ్లమీదా, రిక్షాల్లోనూ, మోటారుకార్లలోనూకనిపించే ఫేషనబిల్ పీపులంతా ఫ్రెంచివాళ్లో, చైనావాళ్లో, వియట్నామీలోనూ. రిక్షావాళ్లుమాత్రం నిక్కచ్చిగా కాంబోడియన్ను. వాళ్ళు సంపాదించిన సొమ్ముమాత్రం వాళ్ళకి మిగిలిచావదుట. ఊళ్ళో ఉన్న రిక్షాలన్నింటికీ ఒక్కడే ప్రొప్రయిటరు. వాడు ఎక్కడో ఫ్రాంసులో ఉంటాట్ట. రిక్షావాళ్ళ కూలిడబ్బులు మినహా తతిమ్మ డబ్బంతా ఏజంట్లు పోగుచేసి, వాడికి జేరేస్తూ ఉంటారుట. ఊళ్ళో "అన్నిరిక్షాలూ" ఒక్కడివే అని అనడం కొంచెం అసమంజసంగా అవుపడ్డా, ఎన్నో రిక్షాలు - ఉన్నవాట్లో చాలావరకూ- ఆ ఒక్క ఆసామీవేనని చెప్పుకుంటారు, మరి.

కాంబోడియన్ను - ఆడా, మగాకూడా - ఎర్రవాళ్లానో, యింకా ఆమాటకొస్తే చామనచాయగానో ఉంటారుగాని, వియట్నామీజ్ స్త్రీ పురుషుల్లాగ పచ్చగా మాత్రం ఉండరు. పేదవాళ్ళవడం మూలాన్న కాబోలు, నాజూగ్గా బట్టలు వేసుకున్న వాళ్ళు అరుదు.

హెనోయి రైల్వే స్టేషనంత పెద్దది కాకపోయినా, నాంపెన్ స్టేషను మాత్రం చాలా నీటుగానూ శుభ్రంగానూ ఉంటుంది. అయితే ఆ స్టేషనుంచి ఉదయం ఓ ట్రెయిను వెళ్ళడం, సాయంకాలం ఓ బండి రావడంన్నూ. అంతే. బుక్కింగ్ క్లార్కూ, స్టేషనుమాస్టరూ, వగైరా అధికారాలన్నీ ఒక్కమనిషే నిర్వహిస్తూ ఉంటాడు. ఉదయం బండి వెళ్ళి, మళ్ళీ సాయింకాలం బండి వచ్చేదాకా స్టేషను అయ్యవార్లంగారి నట్టిల్లులాగ ఉంటుంది !

## 2. కోటా - పేటా

కాంబోడియాలో వియట్నాంలోకన్నా ఎండలు జాస్తి. జనవరి పదిహేనో తేదీ ఆ ప్రాంతంలో హెనోయిలో ఊలుబట్టలు వేసుకున్నా చలి ఆగేదికాదు. అలాగే ఉంటుంది అనుకుని వెంట తీసుకువొచ్చిన మూడు వులుసూట్లూ ఎందుకూ పనికిరాకుండా పోయేయి, నాంపెన్‌లో. సాయంకాలం ఆరుగంటలకి స్నానంచేసి, షర్టూ పేంటూ మాత్రమే వేసుకున్నా, మేడదిగి వీధిలోకి వొచ్చేసరికి నుదుటని చెమట పట్టింది, శీతాకాలంలోనే. ఏడున్నరదాకా సూర్యాస్తమానంకాదు యిక్కడ. కాని ఏడున్నరా ఎనిమిది గంటల మధ్య సూర్యాస్తమయం యెంతో మనోహరంగా ఉంటుంది చూడ్డానికి. సాయింకాలం పశ్చిమ ముఖంగా డాబామీదో, బాల్కనీలోనో నుంచుంటే—ఎదరగా చిక్కని ఆకుపచ్చరంగు, అలుముకు వొస్తూన్న చీకటి నలుపుల్లో విలీనమయిపోతూ, కొబ్బరిచెట్లూ అరటితోటలున్నూ - వాటికిపైగా ఎర్రగా కుంకం

పూసినట్లు ఆకాశం, అందులో దిగువగా, యింకా దిగువగా, మరీ దిగువగా నెమ్మదిగా జారిపోతూ — జిగినీనానులో మధ్యని పొదిగిన కెంపులాగ — లేత ఎరుపురంగులో సూర్యబింబం; ఆపైగా లేతపసుపుచ్ఛాయా దానికి యింకా పైగా యిటూ అటూ తెల్లవీ నల్లవీ మబ్బుతునకలున్నూ - గూడుచేరుకుంటూన్న పక్షిసమూహాలు సిల్హౌటీ. సాయింకాలం సంధ్యాసమయంలోకి సంక్రమించి, చీకట్లో విలీనమయిపోవడం, ఎవరో థియేటర్లో లైట్లు తెలియకుండా, నెమ్మదిగా, గ్రాడ్యుయల్‌గా స్విచ్ ఆఫ్ చేసేస్తున్నట్టు అనిపిస్తుంది. ఆ యిరవై ముప్ఫై నిమిషాల్లోనూ ఎంతో ప్రశాంతత. హృదయంఉన్న ప్రతివాడికీ ఆ సీనరీ పెయింటు చెయ్యాలనిపిస్తుంది. ఈ చిత్రాలకి (చిత్రించేది చైనీయులు) బజార్లలో ఎక్కువ గిరాకీ!

నాంపెన్ పట్టణానికి తూర్పున ఉంది తోంసిలాప్‌నది. ఇది తూర్పుగాపోయి రెండునూడుమైళ్ల దూరంలో మీకాంగ్ నదిలో కలుస్తుంది. ఈ రెండునదులూ కలిసేచోట — ఉపనది నీలినీళ్లూ మీకాంగ్ నది ఎర్రనీళ్లతోనూ —— సీనరి బావుంటుంది చూడ్డానికి. అయితే ఉపనది అట్టే లోతు లేకపోవడంవల్ల పెద్దపెద్ద స్టీమర్లేవీ రాలేవుగాని, చిన్న చిన్న స్టీమర్లూ, స్టీమ్‌లాంచిలూ, కోస్తా పడవలతోనూ ఇంకా సమ్మర్దంగానే ఉంటుంది తోంసిలాప్ నది తీరంపొడుగునా.

నది పడమటితీరాన, ఊళ్లోకిపోతూ పేద్ద రాచబాటా, ఆ బాటమ్మటే వెళితే కాంబోడియారాజు కోటానూ. రాజుగారి కోటకి ప్రాకారపుగోడ మొదలైన చిహ్నాలన్నీ ఉన్నాయిగాని, మనవైపు కోటల్లో బురుజులూ అవీమాత్రం లేవు. అదో పేద్ద భవనం. సింహద్వారందగ్గిర లాంఛనంగా సిపాయిలూ, లోపలికి వెళ్ళి చూడ్డానికి పర్మిషన్లూ తతంగం అంతాఉంది. కోట నిర్మాణం అదీ బర్మా గృహనిర్మాణానికి దగ్గిరగా ఉన్నట్టు స్థూలదృష్టికి గోచరిస్తుంది కాని, తఫ్సీలుగాచూస్తే హైందవనిర్మాణ శిల్పం చాలా మిళితం అయిపోయినట్టు స్పష్టంగా తెలుస్తుంది. ఏదయినా అదీ

యిదీ మిళితంఅయి యింకో తరహా కొత్త శిల్పం – కాంబోడియా శిల్పం – వెలిసింది. స్తంభాలమీాదా, సత్రపు గోడలమీాదా చెక్కిన చిలవలూ పలవలూ మన శిల్పానికి చాలా దగ్గిరగా ఉంటాయి. గుండ్రంగా బల్లపరుపుగా ఉన్న రంగు పెంకులతో యింటికప్పు, విప్పిన నెమలిపురిలాగ, అందంగా ఉంటుంది బిల్డింగు శిఖరాన గుళికాకారంతో ఓ విశిష్ఠమయిన డిజైను. ఈ రకపు డిజైను కాంబోడియా దేశపు వాస్తుశాస్త్రం ప్రత్యేకత.

అన్ని కోటల్లోలాగే యీా కోటలోనూ యిప్పుడున్న రాజు తాలూకు తండ్రి, తాత ముత్తాతల విగ్రహాలూ, ఓ వేపుగా వాళ్ళు ఉపయోగించిన ఆయుధాలూ, యితర పరికరాలూ, పర్వ దినాల్లో వాళ్ళు ధరించే దుస్తులూ అవీయివీ ఉన్నాయి. ఇవికాక ప్రత్యేకించీ దర్బారు హాలు ఒకటీ, దానికి దగ్గిరగా మంత్రాంగం జరిపేగదీ, మరో వేపుగా పితృపితామహుల అస్థికలు పదిలపరిచిన జాగా యిటువంటివన్నీ ఉన్నాయి. దర్బారు హాలుమాత్రం చాలా గంభీరంగా పెద్ద సింహాసనాలతోనూ, కొలువుకూటంలో ఉండే ఆయా ఆసామీాల తాహాతుకి తగిన ఉన్నతాసనాలతోనూ, కేండిలా బ్రాకెట్లతోనూ హంగామాగా ఉంది. రాజావారి సింహాసనం ప్రక్కనేమాత్రం రాణీవారి సింహాసనం లేదు; అది రాజావారి ఆసనానికి వెనగ్గా ఉంది.

కోటలో పైభాగపు వరండాలలో గోడలన్నిటిమీాదా ఏవేవో చిత్రాలున్నాయి - ఏనాడో చిత్రించినవి. కొన్నింటికి రంగులు పోతున్నాయి కూడాను. స్కూళ్లలో జాగా లేకపోతే, యీా వరండాలమీాద స్కూళ్ళు పెట్టుకోమని ఉదారస్వభావుడు రాజుగారు అనుమతి యిచ్చేరు; దాంతోపాటు స్కూలు జరుగు తూన్నప్పుడు ఇతరులు యెవ్వరూ అందమ్మట తాల్లాడి కుర్రాళ్లని "డిస్టర్బు" చెయ్యకూడదని హుకుంకూడా జారీచేసేరు. అంచేత ఆ బొమ్మలేవిటా అని వివరంగా చూడ్డానికి వీల్లేకపోయింది.

ఆ ప్రాంగణంలోనే ఉంది "సిల్వర్ పెగోడా." ఇది కేవలం రాజుగారికోసం ప్రత్యేకించి కట్టిన పూజాగృహం. ఇందులోకి వెళ్ళినప్పుడు జోళ్ళు తీసెయ్యాలి. ఈ పెగోడా (అడుగున) నేల అంతా వెండి పలకతో కట్టేరు. అంచేతే దీన్ని "సిల్వర్ పెగోడా అంటారు. అన్నీ మొత్తం పది అంగుళాల చౌకం పావు అంగుళం దళసరిఉన్న పలకలు 40,007 ఉన్నాయిట. నాలుగడుగుల ఎత్తున ఉన్న వెండి సింహాసనాలు రెండు మూడున్నాయి. లోపల – యీ సింహాసనాల్లో బుద్ధుడి విగ్రహం ఒక దాంట్లోనూ, మాయాదేవి విగ్రహం మరో దాంట్లోనూ, సిద్ధార్థమూర్తి యింకో దాంట్లోనూ ఉన్నాయి. వీటికి ముందుగా ఓ పదిహేను అడుగుల ఎత్తున పెద్ద బంగారపు గిల్టు సింహాసనం దానిమీద స్ఫటికశిల బుద్ధుడున్నా. ఈ బుద్ధమూర్తి స్వయంప్రకాశంగా ఉంటుంది (Luminous), మందిరం తలుపులు అన్నీ వేసేసిచూస్తే ఆ చీకట్లో యీ బుద్ధ విగ్రహం ఎంతో కాంతివంతంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ప్రపంచంలోకల్లా అదొక్కటే అటువంటి స్వయంప్రకాశం అయిన బుద్ధ విగ్రహం అని ఆ మందిరంలో ఉండే ఆసామీ అన్నాడు. మందిరం చుట్టూ నాలుగు గోడలమీదా బుద్ధదేవుడి జీవితచరిత్ర అంతా బొమ్మలతో చిత్రించి ఉంది. అందు విశేషః యేవిటి అంటే, కుడివేపు గోడమీద స్వర్గం – నరకం దృశ్యాలు చిత్రించేరు. నరకంలో ఓ-చోట యిద్దరు రాక్షసుల్లాంటి వాళ్ళు ఓ మనిషిని నిలువునా అంపంతో కోసేస్తూన్నట్టూ, మరోచోట యినప ముక్కుల కాకులు ఒహడ్ని కళ్ళు పొడుచుకు తింటూన్నట్టూ, యింకో చోట మనిషిని తలకిందుగా వేలాడదీసి, కింద పెద్ద మంట పెడుతూన్నట్టూ – యిలా ఉన్నాయి బొమ్మలు. ఇంక స్వర్గంలో అప్సరసలూ, ఉద్యానవనాలూ; సరస్సులూ అవీ యివీని.

రాచబాటకి యెదరగా తోంసిలాప్‌నదిమీద పెద్ద రేవు, కింద నీళ్లలోకి దిగడానికి మెట్లూ వాటితో ను. మెట్లకి ఎడంవేపున చిన్న పాంటూనూ, దానిమీద తేల్తూ చిన్న కర్రయిల్లూనూ.

డిజైన్లతోనూ, రంగులతోనూ, గిల్టుపూతతోనూ యిదీ ఆకర్ష ణీయంగానే ఉంది. రాజుగారి కోసం ప్రత్యేకించి కట్టినది యిది. శ్రావణ పూర్ణిమనాడు "జలోత్సవం" జరుగుతుంది. ఆనాడు నదిలో బోట్ రేసులు (Boat Races) జరుగుతాయి. ఆ ఉత్సవం చూడ్డానికి రాజుగారు తమ పరివారంతో సహా విచ్చేసి, యీయింట్లో సుఖాసీనులయి, వేడుక చిత్తగిస్తారు. నది అంతా దీపాలతోరణాల తోనూ, పడవలతోనూ, బాణా సంచాలతోనూ చాలా సందడిగా ఉంటుంది.

## పెన్ కొండ

నిజంగా చూడవలసింది పెన్‌కొండ. పెన్ అనే భక్తురాలు ఈ కొండమీద ధ్యానంచేసుకుంటూ ఉండేదనీ, యీ కొండ చుట్టూ వెలిసిన ఊరవడంవల్ల దీనికి "నాంపెన్" అని పేరువొచ్చిం దనీ అంటారు. ఈ కొండమీద చక్కటి పెగోడా ఒకటి ఉంది. పెగోడాలోపల ప్రత్యేకించి చెప్పుకోతగ్గ విశేషం ఏమీలేకపోయినా చుట్టూ కట్టడం శిల్ప చాతుర్యంవూ కన్నులపండువగా ఉంటుంది. అసలే రాతిమీద కట్టేరేమో, ఆవరణచుట్టూ పడగవిప్పిన ఓ పెద్దనాగుపాము మలిచేరు. సింహద్వారందగ్గిర మెట్లకి రెండు వేపులా రెండు పడగవిప్పిన ఆదిశేషువులుచెక్కి, పాము తోకలు వెనక్కి మెట్లమ్మటే ఎత్తుగా మలిచేరు. ఈ శిల్పానికీ, దక్షిణ హిందూశిల్పానికీ ఏమీ తేడాలేదు. చాలకాలం క్రితం, దక్షిణ హిందూసంస్కృతి ఈ దేశంలో ఎక్కువగా ఉండడంమూలాన్ని, శిల్పంలోకూడా ఆ యీ సంప్రదాయాలు లోతుగా నాటుకు పోయినాయి.

ఇహ నింకా చూడవలసినవి పగటిపూట హొటేళ్లూ రాత్రి పూట 'నైటుక్లబ్బు'న్నూ. హొటేళ్ళు చూడ్డానికి శుచిగా అవు పడతాయిగాని, భోజన సదుపాయంలో శుభ్రత తక్కువ అనే చెప్పాలి. ఓ పెద్దహొటేల్లో అయిదుపూటలు భోంచేస్తే, మూడు పూటలు "లెట్యూసు" ఆకుల్లో పురుగులు (Lettuce) కనిపించేయి.

ఇంకో హొటేల్లో తినడానికి పెట్టినపళ్ళు కడిగి శుభ్రపరిచే ఆ నవాయితు ఏకోశాన్నీ లేదు. బజార్నుంచి ఎలా తెచ్చినవి అలాగే టేబిలుమీద సెర్వుచేయడం. ఇంకోసారి ఐస్‌క్రీంలో తలవెంట్రుక వొచ్చింది. (వంటావిడ ఆవేళ తలంటుకుందన్నాడు, కూడాఉన్న మిత్రుడు !)

"నైటు క్లబ్బు" (Night clubs) విపరీతంగా ఉన్నాయి. అందులో ముఖ్యంగా చెప్పుకోతగ్గది "ట్రికోటీన్". ఒకే క్లబ్బులో మూడు వివిధ భాగాలు ఉండడంవల్ల దీని కీపేరు పెట్టేరు. ఓ వేపు కాంబోడియన్ సంగీతంవే నృత్యంవూ; మరోవేపు చైనా సంగీతం; నాట్యంన్నూ ; యింకోపక్క ఫ్రెంచి మ్యూజిక్కూ, డాన్సున్నూ. సెంజానో, షాంపెయిన్ మొదలయిన పానీయాలు సేవిస్తూ, రాత్రి 2-30 దాకా హుషారుగా డాన్సుచేస్తూ కాలం గడుపుతారు యిక్కడ. శనివారం రాత్రిళ్లు యీ క్లబ్బులో జాగా దొరకడం కష్టం ! ఇక్కడ "నైట్ లైఫ్" కొంత గడబిడగానే ఉంటుంది, మరి!!

కాంబోడియాలో అంతమందీ బౌద్ధులు. ప్రతీవాడూ యుక్తవయస్సు వొచ్చింతరవాత రెండేళ్ళన్నరపాటు బౌద్ధమతంలో చేరి, ఆ మతానికిగాను పనిచెయ్యాలని రూలు. ఈ రూలు ఆడవాళ్ళకి వర్తించదు. బౌద్ధులవడం మూలాన్ని వీళ్ళు పాలుతాగరు. దూడలకి వొదిలిపెట్టకుండా చెయ్యడం జీవహింస అని పాలు పితకరు; పెయ్యలకి వొదిలేస్తారు. మళ్ళీ మాంసం తింటాడు, ప్రతీ వాడూ. "ఏం స్వామీ" అంటే "మేం చంపేంవా? అమ్మినవొస్తువ కొనుక్కుంటున్నాంగాని, కూరగాయల్లాగ" అన్నా డొకాయన ! పెరుగూ, నెయ్యీ యిలాంటి పాల సంబంధం అయిన వస్తువులు అసలు తెలియవు, వీళ్ళకి. ప్రొఫెసరు వెంకటగారి భార్య, వెన్న తీసి నెయ్యి కాచి సీసాలో భద్రంగా పెడితే, పనిచేసేది ఆ సీసా కాస్తా కిటికీలోంచి ఆరామడల దూరానికి విసిరి పారేసింది. రాత్రి తీరా విస్తళ్లముందు కూచుని, నెయ్యిజాడీకోసం చూస్తే, ఎంత వెతకినా కనిపించదాయె. చివరికి, "నువ్వుగాని తీసేవా!" అని మని

షిని అడిగితే, ఎంతో గొప్పగా చెప్పిందిట "అవునమ్మా అందులో ఏదో భరించరాని వాసన వేస్తూ ఉంటే అవతల పారేసే" సనీ! అక్కడవాళ్లు వంటకి కొవ్వు (Lard) ఉపయోగిస్తారుట, మరి "ఎద్దుకేం తెలుస్తుంది. అటుకుల రుచి" అందామె, నవ్వుతూను.

# 3. చదువూ - సంధ్యా

అసలు మొదట్లో ఇండో చైనా అంతకీ హెనోయ్ సంస్కృతీ కేంద్రం. ఇప్పటికీ హెనోయ్‌లో విద్యపట్ల కనిపించే ఆసక్తీ ఆధిక్యతా కాంబోడియాలో కనిపించవంటే అతిశయోక్తి కాదు. నాంపెన్‌లో విద్యార్థుల సంఖ్యకన్న విద్యాలయాలు ఎక్కువ. మిడిల్ స్కూల్సు అంటే థర్డ్‌ఫారం వరకూ; విద్యాబోధచేసే స్కూళ్లు – భారీ అయినవి – ఆరేడు ఉన్నాయి; కాని ఆ పైనుంచీ గ్రాడ్యుయేషను క్లాసువరకూ విద్యగరపే కాలేజీ ఒక్కటే "లిసే సిస్సావాత్" (Lycee Sissowath) ఇందులో థర్డ్ ఫారం నుంచీ బియే వరకూ చెబుతారు. కాంబోడియా అంతటికీ యిదొక్కటే కాలేజీ కావడంవల్ల ఉన్నతవిద్య అభ్యసించదలుచుకున్న ప్రతివాడూ యిక్కడికి రావలసిందే. కాంబోడియన్ భాషలో డిగ్రీలు విద్యామంత్రిత్వశాఖ (సైగాను) నుంచి యిస్తారు. మిగతావి (ఫ్రెంచి) పారిస్‌నుంచి ఆచార్యులు వొచ్చి పరీక్షచేసి యిస్తారు. ఈ కాలేజీ పారిస్ యూనివర్సిటీకి ఎఫీలియేటు అయివుంది.

చదువులపద్ధతి – మెట్రిక్యులేషనూ, గ్రాడ్యుయేషనుంచి – పాశ్చాత్యపద్ధతుల్లో నడుస్తుంది, బౌద్ధమతానికి సంబంధించినంత వరకూ మాత్రం ప్రాచీన హిందూదేశచరిత్ర చెబుతారు. ఏ క్లాసుకీ జీతాలు కట్టనక్కర్లేదు. అసలు చేర్చుకునేటప్పుడే పరీక్ష చేసి తగినవాళ్లనే చేర్చుకుంటారు. ఆ తరవాత క్రమంగా ప్యాసయి, పై క్లాసులోకి వెళతారు విద్యార్థులు. ఎడ్యుకేషను

ఫ్రీ. కాగా పై ఊళ్లనుంచి వొచ్చిన పేద విద్యార్థులకి వసతి భోజన సౌకర్యాలూకూడా కాలేజీ ఆవరణలోనే ఫ్రీ యేర్పాటు. 500 మందికి యిటువంటి సౌకర్యాలు ఏర్పరచడానికి వీలుంది. వీళ్లకి బట్టలు ఉతకడానికి చాకలికూడా ఫ్రీయే! తలొక్కక్క మంచంవూ, దోమతెరా, దుప్పట్లూ, తలగడాలున్నూ; గోడవైపుకి కోటు స్టాండు, యింకా ఆ వైపుకి టాయిలెట్టు టేబిలూ అదీ యిలాంటి సౌకర్యాలన్నీ ఉన్నాయి. భోజనం బాగుంటుంది. వంట సూపరు వైజు చెయ్యడం - ఒక్కొక్కరోజు ఒక్కొక్క స్టూడెంటు. ఇహ బాగుండ కేంచేస్తుంది? సాయింత్రం ఆడుకోడానికి గేమ్సూ, స్పోర్ట్సూ, వ్యాయామశాలా అన్నీ ఉన్నాయి. వీళ్లుండే వసతి బాగా గాలీ వెలుతురూవొచ్చి మంచి ఆరోగ్యకరంఅయిన వాతా వరణంలో ఉంది.

ఈ సదుపాయాలన్నీ కాక, ప్రైవేటు స్టూడెంట్సుకి అనేకం స్కాలరుషిప్సు, ఏమాత్రం బ్రిలియంటు స్టూడెంటు అనిపించుకున్నా అధికార్లే అన్ని ఖర్చులూ భరించి ఉన్నతవిద్యకి ఫ్రాంసు పంపి స్తారు. తరవాత ఉద్యోగం ఖాయం. ఇన్ని సదుపాయాలూ ఉన్నా చదువుకునేవాళ్లసంఖ్య తక్కువనే చెప్పాలి. అందులో కాలేజీ క్లాసువరకూ చదువుకునేవాళ్లు బొత్తిగానే. "లిసే సిసోవాత్" లో మాత్రం పదివేలమంది విద్యార్థులు అన్నిక్లాసుల మొత్తంమీదా ఉన్నా, గ్రాడ్యుయేషను క్లాసులో వాళ్ళు మాత్రం చాలాతక్కువ. అసలు మొగపిల్లల విద్యాపరిస్థితే యిలా ఉన్నప్పుడు యింక ఆడ పిల్లల చదువూ సంగతీ విమర్శించనక్కర్లేదు. ప్రత్యేకించీ ఆడ పిల్లల స్కూళ్ళు ఉన్నాయిగాని, అవి మిడిల్‌స్కూళ్లు కేవల మున్నూ. కొంచెం కొంచెంగా కో-ఎడ్యుకేషనుకూడా లేక పోలేదు. "లిసే సిసోవాత్"లో పది పదిహేనుమంది ఆడపిల్లలు చదువుకుంటున్నారు.

లైబ్రరీ ఓ మోస్తరుగా కాస్త బాగానే ఉందికాని ఫిజిక్సు, కెమిస్ట్రీ లేబరేటరీల్లో పరికరాలు ఏమాత్రం సంతృప్తికరంగా

లేవు నాంపెన్‌లో. ఇతర క్లాసుల్లోమాత్రం గ్లోబులూ, మేపులూ అవీ యివీ కుప్పలుతిప్పలుగా ఉన్నాయి.

ప్రొఫెసర్ల జీతం చాలా భారీస్కేల్లో ఉంటుంది. వీళ్ళకి బంగళా ప్రభుత్వం సప్లయిచేస్తుంది. ఇంతమంది పిల్లలుంటే ఫలానా యింతజీతం అని, పిల్లల యీడూ, సంఖ్యనిబట్టీ జీతం హెచ్చుతూ ఉంటుంది. రెండేళ్లకి ఓసారి అర్నెల్లు సెలవయిస్తారు. ఈ సెలవల్లో ఫ్రాంసుకెళ్లి రావడానికి (ఫ్రెంచివాళ్లయితే) యిండియన్సయితే తమదేశం వెళ్లిరావడానికీ విమానంలో రానూపోనూ ఖర్చు ప్రభుత్వం భరిస్తుంది. అంతేకాకుండా యీ సెలవు ఆ పై దేశంలో కాలుపెట్టిందగ్గిర్నుంచీ లెక్క అవుతుంది. అంటే, రానూపోనూ ప్రయాణంలోపోయిన రోజులు సెలవలో జమ అయిపోవు.

ప్రొఫెసర్లకి ప్రిన్సిపాలంటే భక్తిగౌరవా లున్నాయిగాని, అనవసరం అయిన హైన్యభావంగాని, దాస్యభావంగాని లేవు. ఆయన ఓ సబ్జెక్టులో గొప్పవాడయితే మనం యింకో దాంట్లోను అనే ఓ గుండెనిబ్బరం. ప్రిన్సిపాలుకూడా ప్రొఫెసర్లని ఎంతో ఆదరాభిమానాలతో చూస్తాడు — కాంబోడియాభాష చెప్పే ప్రొఫెసర్లను కూడాను. (మన తెలుగు సంస్కృతం లెక్చరర్లు జ్ఞాపకంవొచ్చి యీ ముక్క ప్రత్యేకించీ అడిగేను) ప్రిన్సిపాలు తన ప్రొఫెసర్ల పేరు చెప్పుకుని గర్వపడతాడు. కాలేజీ గుమాస్తాలకికూడా ప్రిన్సిపాలు దృష్టిలో కొంత స్థానం గౌరవం ఉన్నాయి.

ప్రొఫెసర్లంటే స్టూడెంట్లకి అమితమైన భక్తి. క్లాసులో పాఠం అయినతరవాత స్టూడెంట్సు వొంగి వొంగీ వెళతారు, బయటికి. ఏదైనా సందేహంవొచ్చి అడగాలనుకున్నప్పుడూ, లేదా అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పినప్పుడూకూడా నడుముకి చేతులు కట్టుకుని జవాబుచెప్పి తల బాగా వొంచి నమ్రత తెలియజేస్తారు.

సర్వసాధారణంగా వీళ్లు ఒక్క అన్నం తప్ప యింకేదీ వొండరు. పచ్చిబీరకాయ ముక్కలో, పచ్చివంకాయ ముక్కలో ఉప్పులో అద్దుకుని ఆరుగిన్నెల అన్నం అమాంతం కాజేస్తారు.

మనం గోంగూర తొక్కుడుపచ్చడి పెట్టుకుని ఏటి ఏడాదీ తిన్నట్టు వీళ్లు చేపలు తొక్కుడుపచ్చడి పెట్టుకుని ఏడాదిపొడుగునా తింటారు. అన్నంలోకి అది ముఖ్యంఅయిన ఆధరువు.

## కాంబోడియా సంస్కృతీ - హైందవ ప్రాబల్యం

వీరి గృహనిర్మాణశిల్పంలో దక్షిణ హిందూశిల్పం చాలా వరకు కానవస్తుందని మనవిచేసేను. ఆంకోర్ లో ఉన్న శిథిలాలూ, దేవాలయాలూ చూస్తే, మధుర కోవెల నిర్మాణం జ్ఞాపకం వస్తుంది. అంతేకాకుండా ఆంకోరులో ఉన్న దక్షిణ హిందూశిల్పం అసలు దక్షిణ హిందూస్థానంలో ఉన్న శిల్పంకంటె మిన్నగా ఉంటుంది కూడాను.

వీళ్లు బౌద్ధమతస్థులయినా, హైందవఆచారాలు కొన్ని నిబిడంగా నాటుకుపోయినాయి వీళ్లలో. మాటవరసకి బౌద్ధ భిక్షువులు అలా ఉండగా పౌరోహిత్యంకూడా లేనిదీ ఏ పుణ్య కార్యక్రమంవూ జరగదు. ఈ బ్రాహ్మలని "బకు" అంటారు. వీళ్ళు పంచెకట్టూ, అర్ధచంద్రాకారంగా ముందుకి నున్నగా క్షవరం చేసిన తలా, వెనక్కి పిలకా - అంతా సలక్షణంగా - అచ్చంగా బ్రాహ్మలు !

నాంపెన్ మ్యూజియంలో లక్ష్మి శివ విష్ణువుల త్రిమూర్తి విగ్రహా లున్నాయి. "స్నానద్రోణి" (cuve a ablution) ఒకటి, శేష ఉపస్థితబుద్ధుడూ ప్రత్యేకించీ ఆకర్షించే వస్తువులు. శేషశాయి బుద్ధుడూ, నాగస్థితబుద్ధుడూ, గరుడ విగ్రహం, మధ్యన అజ్ఞాన పరిమితబుద్ధుడూ, అటూయిటూ లోకేశ్వర బుద్ధుడూ, ఉన్న బుద్ధత్రయం, బ్రహ్మ యిలాంటివి యెన్నో హిందూ బౌద్ధ సంప్రదాయాలు మిళితం అయిపోయిన వస్తువులు కనిపిస్తాయి. కాంబోడియన్ స్కూల్ ఆఫ్ ఆర్ట్సు (Combodian School of Arts) లో ముఖ్యంగా ఆకర్షణీయంగా కనిపించే బొమ్మ "నటరాజు".

ఇంక వీళ్ల భాషలోకూడా యెన్నో సంస్కృతపదాలు కలిసి పోయినాయి. ఉదాహరణకి మనవిచేస్తాను: గ్రు అంటే గురువు; సముందే అంటే సముద్రం; కబల్ అంటే (కపాలం) తల; పుత్ = కొడుకు (పున్నామ నరకాత్ త్రాయితేయితి పుత్రః అని ఎప్పుడో చిన్నప్పుడునూ మా గురువులు మేడేపిల్లి రమణాచార్యులుగారు చెప్పిన ముక్క గుర్తు కొచ్చింది, పై విశేషం ప్రొఫెసర్ వెంకట గారు చెబుతూఉంటేను) అఖ్నీ అంటే అగ్ని – యిలాగ యెన్నేనా ఉన్నాయి.

వీళ్లకి జాతకాల్లో నమ్మకం ఉంది. పెళ్లిముందర పిల్లాడి జాతకం, పిల్ల జాతకంవూ విధిగా చూస్తారు. జాతకాలు నప్పకపోతే పెళ్లికావడానికి యెంతమాత్రం వీల్లేదు.

వీళ్ల నెలల పేర్లు అచ్చంగా సంస్కృతం;

సెత్ = చైత్రం,
విస్సాఖ్ = వైశాఖం.
సెస్ = జ్యేష్ఠం.
ఆసాధ్ = ఆషాఢం.
శ్రావ్ = శ్రావణం.
ఫోత్రోబాత్ = భాద్రపదం.
అశోక్ = ఆశ్వీజం.
కాత్తిక్ = కార్తికం.
మాక్సీర్ = మార్గశిరం.
బోస్ = పుష్యం.
మాఘ్ = మాఘం.
ఫాల్కున్ = ఫాల్గుణం.

కాగా మనలాగే వీళ్లకీ 60 ఏళ్లూ, వాటికి అరవై పేర్లూ (ప్రభవ, విభవ లాగ) ఉన్నాయి.

# 4. మతం - ఆచారాలూ

క్రీస్తుశకపు తొలిశతాబ్దాల్లో ఇండోచైనాలో హిందూ సామ్రాజ్యాలు అనేకం వెలిసేయనీ, అందులో ఒకటి కాంభుజం (ఇప్పటి కాంబోడియా) అని యిక్కడి చరిత్రకారులు అంటారు. కానయితే యీ హైందవరాజ్యాలు స్థాపించకముందునుంచీ వొస్తున్న నమ్మకాలూ, ఆచారాలూ, అనవాయతులూ అవీ, తరవాత వొచ్చిన హిందూ సంస్కృతితో జములుగా కలిసిపోయి, యింకొక వినూత్నం అయిన సంస్కృతిని పాదుకొల్పాయి. "ఆంకోరు"లో ఉన్న శిల్పనైపుణ్యాం, హైందవ శిల్పం ఆధారంగా వెలిసినమాట నిజమేకాని, ఆమోస్తరు శిల్పం ఇండియాలోనూ ఇండొనేషియాలోనూ కూడా లేదంటారు, తెలిసినవాళ్లు. కాగా, వొక్క హిందూ మతంవే కాంబోడియాలోకి జొచ్చుకుపోయిందన డానికీ వీల్లేదు. బ్రాహ్మణమతం—ముఖ్యంగా శైవమతం బాగా నాటుకుంది యిక్కడ - అదలా ఉండగా మహాయాన బౌద్ధమతం వొచ్చి చేరింది, అనేక చిలవలూపలవలతోనూ. ఆరు ఏడు శతాబ్దాలు గడిచేటప్పటికి హీనయానా బౌద్ధమతం సుస్థిరంగా యేర్పడింది. దీనికే కేంద్రం సింహళం. ఈ కలగాపులగంలో మతచిహ్నాలు కొన్ని జీర్ణించిపోయి, రూపుమారి, యిప్పటికి పండుగలూ పబ్బాలలోనూ, చావు - పుట్టుకలకి సంబంధించిన ఆచారాల్లోనూ కనిపిస్తూనే ఉంటాయి. మాటవరసకి, ప్రతి పుణ్యానికీ ఆచారం గలవాళ్లు ఉపవాసండుండి, చంద్రుణ్ణి చూసిన తరవాత కొబ్బరినీళ్ళలో నానపెట్టిన అటుకులూ, అరిటిపళ్లూ ఫలహారం చేస్తారు.

బుద్ధ భిక్షువులు అలాఉండగా బ్రాహ్మలు ప్రత్యేకించీ ఉన్నారు ముహూర్తాలు పెట్టడానికి, శుభాశుభ కార్యాలు జరిపించడానికిన్నీ. వీటి అన్నిటికీ ప్రత్యేకించి తంతు! అంచేత కాంబోడియాలో బౌద్ధమతం లోతుగా నాటుకుపోయినప్పటికీ, హైందవ

ఆచారాలూ సంప్రదాయాలూ నశించిపోలేదని అనుకోవడం. రాజుగారికోటలో "బకు" (Baku) లని ఉంటారు; వీళ్లు వంశపారం పర్యంగా వొస్తూన్న పురోహితులు. శుభాశుభ కార్యాలన్నీ వీళ్లు చెప్పినట్టూ నడవవలసిందే. బౌద్ధ భిక్షువులువొచ్చి బుద్ధభగ వానుడి ప్రవచనాలు వల్లించీ వ్యాఖ్యానించీ చెబుతారు; కాని అంతమాత్రంవే. ఇక్కడ యింకోచిక్కు వొచ్చిపడింది. బౌద్ధ సన్యాసులు వాళ్లమట్టుకు వాళ్లు ధ్యానం చేసుకుంటూ కూర్చుంటే, తతిమ్మావాళ్లకి మతబోధ చెయ్యడంవూ, వాళ్లని సక్రమ పంథాలో పెట్టడంవూయెలాగ? అందుకని మతానికీ ప్రజలకి "లింకు"గా "ఆచార్యులు" వెలిసేరు. పైనజెప్పిన "బకు" లు యిటు వంటివాళ్లే. ప్రతి ఊళ్లో అథమపక్షం ఒక్క ఆచార్యుడైనా ఉంటాడు. వీళ్లు కొద్దో గొప్పో కొమ్ములు తిరిగినవాళ్లే, మతవిష యాల్లోను ఇదుగో వీళ్లూ, ఎప్పుడు ఏపండుగా, ఏ కార్యంవూ ఎలాచెయ్యాలో, ఏయేమంత్రాలు చెప్పాలో అవన్నీ చెప్పి చేయి స్తారు. అన్నికార్యాల్లోనూ వీళ్ళదే పైచెయ్యి. వీళ్లు ఎలాగ చెబితే అలాగ చెయ్యవలసిందే. బుద్ధ భిక్షువులనీ ఫలానా కార్యానికి రావలసిందిగా పిలుస్తారు. అలా వచ్చి వాళ్లు ఓమూల కూర్చుంటారు. బౌద్ధధర్మాలు యేకరువు పెడుతూనో, లేదా సమర్పించిన మహానైవేద్యం ఆరగిస్తూనోను; అంతేకాని కర్మకాండలో యెంతమాత్రం కలుగజేసుకోరు. అదంతా ఆచా ర్యుల చేతిమీదుగా నడువవలసిందే.

ఈ ఆచార్యులు ప్రజలకీ దేవతలకీ (దెయ్యాలకీ) మధ్య వర్తులు. వీళ్లే జాతకాలు రాయాలి; ఏ పనికయినా వీళ్లే ముహూర్తం నిర్ణయించాలి; ఏ యే కార్యాలకి యేయే నైవేద్యం చేసి అర్పించాలో అదికూడా వీళ్లే చెప్పాలి. ఈ తతంగం అంతా వీళ్లకి వంశపారంపర్యంగా వచ్చిన విద్య.

## ఆ న వా యి తు లు

కొవ్వొత్తులు: ఊదొత్తులూ, కొవ్వొత్తులూ అన్ని కార్యాలలోకూడా ఉపయోగిస్తారు. ఊదొత్తులు అయిదేసిచొప్పున వెలిగించాలి, యించుమించుగా ప్రతి కార్యానికిన్నీ. ఈ సంఖ్యకి భిన్నంగా ఒకటీ రెండు ఊదొత్తులు యెప్పుడూ వెలిగించకూడదు, మహాపాపం. ఇంకా భారీయెత్తున జరిగే కార్యాలలో తొమ్మిదేసి చొప్పున వెలిగిస్తారు. ఈ విధంగానే ఉగాదినాడు అయిదో తొమ్మిదో చిన్నచిన్న యిసకకొండలు* నిర్మిస్తారు. ఈ తొమ్మిది పెగోడాలో ఉండే తొమ్మిది "సెయిమా" (Seima) అని ఉద్దేశం, తమలపాకులో పసుపుముద్ద విఘ్నేశ్వరు డనుకున్నట్టు!

అయిదు ఊదొత్తులూ అయిదుగురు బుద్ధులన్నీ సంతృప్తి పరుస్తాయి అంటారు కొంతమంది సనాతనులు. ఒక్కొక్కప్పుడు మాత్రం మూడేసి వెలిగిస్తారు.— ఆమూడింటిలోనూ ఒకటి బుద్ధుడూ, రెండోది బౌద్ధధర్మం, మూడోది బుద్ధభిక్షువులూను. ఇంకకొవ్వొత్తులు. వొండిన నైవేద్యాలమీాద పెడుతారు.

అరటిదొప్పలు: అరటి స్తంభాలకి పచ్చని పైపొర ఊడ పెరికిపారేసి, లోపలి తెల్లనిదొప్పలు పొడుగాటి దోనెల్లాకట్టి పండుగ సమయాల్లోనూ, శుభకార్యాల్లోనూ అలంకరిస్తారు; [శవ వాహనానికిగూడా యిలాంటి అలంకరణే చేస్తారు.] అంతేకాకుండా శుభసమయాల్లో ఒక్కొక్క అరటిదొప్పలో ఏయేవస్తువులు యెన్నెన్ని పెట్టి అలంకరించాలో అన్నీ ఆచార్యుడు చెబుతాడు. ఈతడు చెప్పిన ప్రకారం, తు. చ తప్పకుండా చెయ్యవలసిందే. ఇంకాకొన్ని సమయాల్లో దవ్వచిన్న ముక్కలుగాకోసి, అందులో పోకచెక్కలూ తమలపాకులూ అలంకరించి "స్లాథార్లు"

---

*యిందులో మధ్యని యెత్తుగావున్నది మేరుపర్వతం అనీ, మిగతాది దాని చుట్టూ వున్న పర్వత శ్రేణులనీ భావం. ఈసంబంధం అయిన తదితరవివరాలు వొచ్చే వ్యాసంలో చూడండి. ప్లేటులోనో కప్పులోనో [అడుగున కొవ్వొత్తి కరిగించి అతికించి] నిలబెట్టిగానీ దీపారాధన చేస్తారు.

కడతారు. ఈస్థాళ్లలో అనేక రకాలు. కొంతమంది దూటకి బదులు కొబ్బరిబొండాలు ఉపయోగిస్తారు. మరికొందరు "బెయిసే" లని కడతారు. వీటిలో అరటిఆకులు త్రికోణ ఆకారంగా కత్తిరించి (ఎన్ని కత్తిరింపులో ఏంవిటో అన్నీ ఆచార్యుడు చెప్పినప్రకారం జరగాలి మళ్లీని) పెడతారు. మరి కొన్నింటికి నెదురాకులు గుచ్చుతారు. ఈ అరటిదొప్పలు చిన్న చిన్న తెప్పలుగాకూడా కడతారు. మరికొన్ని సందర్భాల్లో. అలా కట్టినవాట్లో కొవ్వొత్తులుంచి యింటి స్తంభాలమీద ఆర్చిల్లో పెట్టి (మనం దీపావళినాడు చేసినట్టు) గృహాలంకరణ చేస్తారు. ఇంకొన్ని సమయాల్లో యీ దీపాలుపెట్టిన అరటి దొన్నెలు నదీగర్భంలో వొదిలేస్తారు.

బియ్యం: తెల్ల అక్షింతలూ, పసుపురాసిన అక్షింతలూ, వొండిన అన్నంవూ, అన్నంతో చేసిన తినుబండారాలూ, యిలాగా రకరకాలు దైవసంతృప్తికీ, ఆశీర్వచనానికీ, నైవేద్యానికిన్నీ.

బలి: పంది, యెద్దు, — ముఖ్యంగా పంది బుర్ర, కోడి కాలూ మొదలయిన కొన్ని భాగాలు దేవుడికి బలియిచ్చి నివేదన చేస్తారు. అయితే యీ బలి క్షుద్రదేవతలకీ, దెయ్యాలకీ మాత్రమే యిస్తారు. ముఖ్యంగా చెప్పుకోతగ్గది ఏంవిటీ అంటే ఎవరికయినా దెయ్యం పట్టుకున్నప్పుడు చేసే ప్రక్రియలలో ఆవుని బలియిస్తారు. కాగా కోడిని ఒకటి తీసుకువచ్చి, చంపేసి దాని రెక్కలు నిడివిగా విప్పిచూపి, ఓ నెమరుకర్రమీద — అచ్చంగా పక్షి రెక్కలు విప్పుకు వాలినట్టు నిలబెడతారు. దాని తరవాత పూజా పునస్కారన్నూ. ఇలాంటివే కొంత ప్రక్రియసామగ్రి కొయ్య బొమ్మలూ, తాటాకు బొమ్మలూ, కొబ్బరి రేకుల్తో అల్లిన బొమ్మలూ, కుండబొమ్మలూనూ. వీటిని ముఖ్యంగా మరిడెమ్మ, గొట్టాలమ్మలాంటి అమ్మవార్లకి ఉపారాలుపెట్టి పూజచేసినప్పుడు వాడతారు.

గొడుగులూ – అరటిచెట్లు: గాఢమయిన రంగులువేసిన పట్టుగుడ్డతోనో, నారబట్టతోనో అలంకరిస్తారు శవవాహనం.

చుట్టూ డబ్బులు దారాలకికట్టి వేలాడదీస్తారు. ఆ తరవాత శవం మీద ఆ రంగుబట్టకప్పి, దానిమీద చిల్లర వొస్తువులు — వల్ల కాట్లో ప్రక్రియకి పనికివచ్చేవి పెట్టి వాటిమీద గిడుగులు బోర్లిస్తారు. శవవాహకానికి నాలుగుమూలలా, స్తంభాలు నిలబెట్టినట్లు అరటిచెట్లు ఉంచుతారు.

# 5. ఉగాది

కాంబోడియా వాళ్ళకికూడా మనకిలాగే అరవై సంవత్సరాలూ ఉన్నాయని వెనకటి వ్యాసంలో వ్రాసేను. ఈ అరవై సంవత్సరాలకీ, అయిదేసి సంవత్సరాలకి ఒకటి చొప్పున, పన్నెండు జంతువుల అధిపతులు: మొదటి అయిదు సంవత్సరాలకీ మూషకం, రెండో వర్ష పంచానికి వృషభం; మూడోదానికి వ్యాఘ్రం; నాలుగోదానికి చెవులపిల్లి; అయిదోదానికి డ్రేగన్; ఆరు సర్పం; ఏడు అశ్వం; ఎనిమిది ఆడమేక; తొమ్మిది కోతి; పది కోడి; పదకొండు శునకం; పన్నెండు వరాహంన్నూ; చాంద్రమాన ప్రకారం లెక్కించి పై పన్నెండు జంతువుల వృత్తానికి నప్పిస్తారు. ఇది ఒక రకం లెఖ్ఖ. ఇంక రెండోతరహా, సూర్యమానం ప్రకారం లెఖ్ఖస్తారు. సౌరమానపు లెఖ్ఖలు మామూలు నిత్య కృత్య వ్యవహారాలకీ, చాంద్రమానం మతసంబంధం అయిన వాటికిన్నీ యేర్పాటు. చాంద్రమానపు లెఖ్ఖ చైత్రమాసారంభంతో జరుగుతుంది. రాజ జ్యోతిషులు లెక్కలుకట్టి "ఉగాది" ఫలానా నుంచీ మూడు రోజులు అని నిర్ణయిస్తారు. ఒక్కొక్కప్పుడు యీ పండుగ నాలుగు రోజులుకూడా జరుపుతారు.

ఇందులో ముఖ్యమైనఘట్టం "ఇసకకొండల" స్థాపనా, పూజాన్నూ ఈకొండలు "*పిచికగూళ్ళ"లాగకడతారు, చైత్ర

*తడియిసకలో పిల్లలుకట్టే "పిచికగూళ్ళు"

మాసారంభంతో ప్రారంభం అయి, మాసం పొడుగునా వీటికి పూజలూ పునస్కారమూ జరుగుతూ ఉంటాయి. వీరు చెప్పే గాథల్ని బట్టిచూస్తే, యీ యిసకకొండల పూజా అదీ హిందూ సాంప్రదాయానికి చెందినట్టు కనిపిస్తుంది. ఎంచేత అంటే యీ యిసక కొండలు భారతదేశంలో ఉన్న మహా పర్వతపంక్తులనీ♦, వాటిమధ్య అన్నిటికన్న యెత్తుగా ఉన్నది మేరూపర్వతం అనీ అంటారు. ఇంకొన్ని గాథల్ని బట్టి చూస్తే యీ పెద్దకొండ ఒక అతిప్రాచీన స్తూపం అనీ, అందులో సిద్ధార్థుడు రాజప్రాసాదం, వైభవజీవితం త్యజించినప్పుడు కత్తిరించివేసినజుట్టు పదిలపరిచిన "ప్రాహ్‌స్తూపం" ప్రత్యామ్నాయం అనీ అంటారు. ఈ కొండలలో ఉన్న ఒక్కొక్క యిసక రేణవూ ఒక్కొక్క పాపం పరిహారం చేస్తుందిట! అంచేత ఆచారపరులందరూ భక్తిపూర్వకంగా యథాశక్తి యివి నిర్మించాలి. ఈ మోస్తరుగా అనేక నమ్మకాలు.

కొన్ని స్థలాల్లో యీ యిసక కొండలు మర్రిచెట్టుకి ప్రత్యామ్నా నిర్మిస్తారు. మర్రిచెట్టు క్రిందనే బుద్ధుడికి "జ్ఞానం" లభించింది కనక యిది ఎంతో పూజనీయం అయిన వృక్షం వీళ్ళకి.

సాధారణంగా మర్నాడు పండుగ అనగా తొలినాటి మధ్యాహ్నం కడతారు యీ యిసకకొండలు. అలా కట్టలేని వాళ్లు ఎవరైనా కడుతూన్న చోటికి వెళ్లి ఓ రెండు పిడికళ్ల యిసకవేసినా, ఫలితం దక్కుతుంది. ఇహ మర్నాడు ఉదయాన్నే బుద్ధభిక్షువులకి తండులదానంచేసి, యీ యిసకకొండలచుట్టు ముమ్మారు ప్రదక్షిణం చేస్తారు. బ్రాహ్మలు మంత్రాలు చదివి "శుభం భూయాత్. సకలైశ్వర్యాయురారోగ్యాభి వృద్ధిరస్తు" అని దీవిస్తారు. కాగితంతోచేసిన మర్రిచెట్టూ, ఊదొత్తులూ అవీ యీ కొండలముందు పెట్టి, పసుపునీళ్లు ప్రోక్షించి నమస్కరిస్తారు. ఈ యిసకకొండలు యిసకతోనే చెయ్యాలన్న నిర్బంధంలేదు.

♦ వీటికవతల పెద్దదేవుడిపీఠం ఒకటి పెట్టి యముణ్ణి ఆరాధిస్తారు. మనలోలాగే వీళ్లకీయముడు నరకానికి అధిపతి.

కొన్ని చోట్ల ధ్యానంతోనూ, అన్నంతోనూ, బియ్యంతోనూ, కేకులతోనూ (Cakes) కూడా చేస్తారు.

ఉగాదికి కొద్దిరోజులు ముందుగా నాంపెన్‌లో కాంబోడియా ప్రభువు, పేర్ కొండమీద ఉన్న పెగోడాలో యీ "యిసక కొండల పూజ" జరుపుతాడు. అక్కడ ఒక ప్రాచీన స్తూపంకూడా వుంది. ఇదికాక, యిలాగే కోట ఆవరణలోవున్న "సిల్వర్ పెగోడా" లో కూడా రాజుగారు యిసకకొండలు పెట్టి, ముమ్మారు ప్రదక్షిణం చేస్తారు. లాంజ్వేజ్ క్షేత్రంనుంచి తెచ్చిన యిసక ఓ గుప్పెడు స్వహస్తాలతో ఉంచి, దానికి పువ్వులూ అదీ పూజ చేస్తాడు. ఆ తరవాత రాజకుటుంబం, కొలువుకూటంలో ఉన్నతోద్యోగులూకూడా ఆవిధంగానే పూజచేస్తారు. కాని వీళ్ళు లాంజ్వేజ్ క్షేత్రంనుంచి తెచ్చిన యిసక ముట్టుకో వీలులేదు. అంచేత మీకాంగ్ నదీతీరంనుండి తెచ్చిన ఎర్రటి యిసక జల్లుతారు. బుద్ధభిక్షువుల ప్రవచన ఘోషతోనూ, వారికి అంగవస్త్ర దానంతోనూ తంతు పూర్తవుతుంది.

మనలాగే వీళ్లకీ మకరసంక్రమణం, కటకసంక్రమణం రెండూ తెలుసు. సంక్రాంతి సందర్భంలోనే ఓ చిత్రం అయిన గాథ చెబుతారు. పూర్వం ఒకప్పుడు [1]కపిలమహర్షి (Kabel Moha Prohm=కపిల మహా బ్రాహ్మడు!), [2]ధర్మపాలుణ్ణి మూడు [3]ప్రశ్నలడిగేట్ట. వీటికి గనక ధర్మపాలుడు సరిఅయిన జవాబులు చెప్పేడా, కపిలుడు తనతల యిచ్చేస్తా నన్నాడు; లేదూ, ధర్మపాలుడి తల ఎగిరిపోతుంది. ఇదీ ఒప్పన్నం. అయితే గడువు తేదీలోగా ధర్మపాలుడికి మంచి ఛాన్సు ఒకటి దొరికింది. రెండు గరుడపక్షులు యీ సమస్యలే అనుకోవడం, చర్చించడం విన్నాడు ధర్మపాలుడు; సమానాధాలు చెయ్యి చిక్కించుకున్నాడు. న్యాయం

1. Kapila le Grand Brahmana
2. Thomobal=ధర్మపాలుడు, న్యాయవేత్త.
3. యక్ష ప్రశ్నల్లాంటివి.

చేసుకున్న రోజున అది కాస్తా చెప్పేసరికి, కపిలుడు తన తల కొట్టేసుకోవలసివచ్చింది. కాని కపిలుడు ఓ అసాధ్యఘటం. అతని తలగానీ భూతలం తాకిందా యావత్ భూమండలంవూ భగ భగ మండిపోతుంది; ఆకాశంలోకి గానీ విసిరేసారా యిహమరి వానలు సున్నా; పోనీ అని సముద్రంలో పారేస్తే, ఒక్క బొట్టయినా ఉండ కుండా సముద్రంలో నీళ్లు ఆర్చుకుపోతాయి. ఇలాంటి హిరణ్యాక్ష వరాలు పొందిన బ్రహ్మ కపిలుడిది. అంచేత తన ఏడుగురు కుమార్తె లని పిలిచి, తల నరికీ నరకడంలో మరెక్కడా పడకుండా ఓ వెండి పళ్ళెంలో "పంపుపట్టు" కోమని ఆదేశించాడు. ఆ ప్రకారం పెద్ద కూతురు "తుంగ్యా" తపీమని పళ్లెంలో అందుకొంది. అప్పట్నుంచే ఆకూతుళ్లు తలకొక్కరూ వాళ్ళవాళ్ళ వొంతు ప్రకారం ఓబంగార ప్పళ్లెంలో ఆ తల ఉంచి, మేరూపర్వతం చుట్టూ (60 అనటి"ల" కాలం అంటే పూర్తిగా ఒకరోజు) ప్రదక్షిణం చేస్తారు. వారంలో ఏరోజున సంక్రాంతి పడుతుందో ఆ ప్రకారం యీ యేడుగురు కూతుళ్ళలోనూ వొంతువచ్చిన పిల్ల యీ తల బంగారప్పళ్ళెంలో పెట్టుకుని, దేవదేవతలు వెంటరాగా, మేరూపర్వతం చుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. మాటవరసకి, సంక్రాంతిగానీ ఆదివారంపడితే తుంగ్యా యీ దేవ దేవతాగణాన్ని వెంటవేసుకుని ప్రదక్షిణం చేస్తుందన్నమాట.

ఇంతేనామరి? ఈ పిల్లలు దేవదేవతాగణంతో చేసిన పర్యటనవల్ల ఏటి ఏడాది పొడుగునా కొన్ని ఫలితాలు సంఘ టిస్తాయి. ఆయా ఫలితాలు — మంచీ, చెడ్డా — పంచాంగంలో రాసి ఉంటాయి (మన సంక్రాంతి పురుషుడి లక్షణాలూ, ఫలి తాల్లాగ). అంచేత సంక్రాంతినాడు రాజుగారు శంఖాలూ వాటితో కొలువుకూటంలో తమ సింహాసనానికి ఎదరగా ఉన్న దేవుడి పీఠం దగ్గిరకివొచ్చి, భూదేవతలకీ, రాజ్యాధి దేవతలకీ నమస్కరించి ప్రార్థనచేస్తాడు. జ్యోతిశ్శాస్త్రవేత్తలూ వాళ్ళూ, ప్రభువూ కోటా, ప్రజలూఅంతా ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ, దేశం

సుభిక్షంగా ఉండాలనీ, క్షేమకరంగా వర్థిల్లాలనీ మంత్రాలు జపిస్తారు పాళీభాషలో. ఆ తరవాత రాజుగారు తిరిగీ నమస్కరిస్తారు. ముమ్మారు శంఖాలు పూరిస్తారు. అసలు కోటలోజరిగే యే కార్యంపూకూడా ముమ్మారు శంఖాలు పూరిస్తేనేగాని పూర్తి గాదు. చివరన మంగళవాయిద్యాలు మోగుతాయి.

ఆరోజున రాజుగారు లాంఛనంగా శాస్త్రప్రకారం స్నాన కర్మ ఆచరిస్తారు. ఎన్ని గంటలకి స్నానంచెయ్యాలో హోరా శాస్త్ర ప్రకారం నిర్ణయిస్తారు, పురోహితులు. బుద్ధభిక్షువులు ఆశీర్వాద మంత్రాలు చదువుతూఉంటే, ఓ యిత్తడి గంగాళం నిండా నీళ్లు నింపి కుదుటిమీద నిలబెడతారు. దానిముందు, తెల్లనిబట్ట కట్టు కుని రాజుగారు శుభదిశగా తిరిగి కూర్చుంటారు. ఈ శుభదిశ ఆయుష్షుకి మంచిది. ఆది, సోమ యిలాగ్గా వారాన్ని బట్టి ఈ దిశ రోజు రోజుకీ మారుతూ ఉంటుంది. దీనికి పెడదిశ అశుభం; మారక దిశన్నూ, ఈ రెండూ యెప్పుడూ ఎడా-పెడాగా ఉంటాయి. రాజ పురోహితుడు గంగాళంలో నీళ్లుతీసి రాజుగారిమీద జల్లి స్నానం చేయిస్తాడు. తరవాత ఓంశంఖంతో పోసి కొంచెం తీర్థంయిస్తాడు. (ఇక్కడ కూడా శంఖంతో పోస్తేనేగాని తీర్థం కాదు!) ఈ తీర్థం రాజుగారు ముఖంమీదా, శిరస్సుమీదా, జల్లుకోవాలి. ఇంత సేపూ "బకు"లు (బ్రాహ్మలు) మంత్రాలు చదువుతూనే ఉంటారు.

ఆవేళ రాజుగారు పంచక్షేత్ర విగ్రహాలనీ పన్నీటితో * ప్రోక్షిస్తారు. ఆ విగ్రహ పంచనం ఏవిటీ అంటే – శివుడు, నారాయణమూర్తి, బలదేవుడు, గణేశుడు, ఉమాదేవిన్నీ. ఉగాది మూడురోజుల్లోకీ ఆఖరురోజున రాజుగారు తమ కోటలో ఉన్న బుద్ధవిగ్రహాన్నికూడా పన్నీటితో ప్రోక్షించి, రాచకుటుంబంలో అతఃపూర్వం కాలధర్మం పొందినవాళ్ల ఆత్మశాంతికి జరిపే బుద్ధ సన్యాసుల స్నానాదికాలు చిత్తగిస్తారు.

---

* d'ean pafume'e

ఆనాడే రాకుమారులూ, కుమార్తెలూ, మంత్రులూ, సామంతులూ తదితర భృత్యులూ అంతా పువ్వులూ పరిమళ సామగ్రీ, ఊదొత్తులూ అవీ సమర్పించి రాజుగారికి ఆయురారోగ్యాలు కలగాలని ప్రార్థిస్తారు.

ఆ తరవాత యుద్ధరంగంలో మగ చతురంగబలం తీర్చి నడుస్తూఉంటే మన పురోహితులు పవిత్రజలాలు జల్లుతారు. దాని తరవాత ఏనుగులూ, గుర్రాలూ వెళ్లగా కుస్తీపట్లూ వగైరా వినోదకాలక్షేపం జరుగుతుంది. *

ఊరంతా మధ్యాహ్నంపూట వినోదకాలక్షేపాలూ, ఆటలున్నూ. ఆడా మొగా కలిసి "చంగ్" ఆడతారు. ఓ పక్క అంతా ఆడవాళ్లూ, యింకోవైపంతా మొగాళ్లున్నూ మధ్యను ఉండగాచుట్టి ఎగరేస్తూ, గెంతుతూ, — ఆడుతూ పాడుతూ కాలక్షేపంచేస్తారు.

సియమ్‌రెయప్, బట్టమ్ బంగ్, పుర్సా ప్రాంతాలలో యీ పండుగరోజుల్లో పాటలు పాడుకుంటూ ఉదయాన్నే యింటింటికీ వెళ్ళి, మనవైపు పండుగరోజుల్లో బియ్యందండినట్టు దండుతారు. ఇందులో పగటివేషగాళ్ళు కూడాను. ఓకొంకికర్రకి ఓకొనని దుప్పి బుర్రా, కొమ్ములూ తగిలించి, రెండోకొనని (తోకవేపు) గడ్డి కుచ్చుకట్టి దానిలో ఓగంట వేలాడదీస్తారు. ఈ కర్రమీద ఒకడు నుంచుని దుప్పిలాగ అటూ యిటూ ఎగురుతూవుంటే, రెండోవాడు తన కర్రతుపాకీతో దీన్ని వేటాడతాడు.

కందాళ్ రాష్ట్రంలో స్త్రీలు యీ రోజుల్లో పెగోడాల్లో మీకాంగ్ నదిని అనుకరిస్తూ ఓచిన్న నదిలా చేసి, అందులో చిన్న అట్టపడవలు వొదులుతారు. మీకాంగ్‌నదిలో మొసళ్ళువిపరీతం. ఇలాచేస్తే మొసళ్లబాధ తప్పుతుందని ఓనమ్మకం!

* నేటిరోజుల్లో యీ ఆనవాయతు బాపతు మిగిలిందల్లా, రాజుగారి కొలువుకూటానికి ఎదరగా జరగే కుస్తీపట్లు మాత్రమే. కోట అవతల యింకా రకరకాల వినోదాలు జరుగుతాయి.

# 6. భూదేవతలు

ప్రతీ ఒక్కొక్క ప్రాంతంలోనూ ఒక్కొక్క దేవతో, దెయ్యఁమో ఉంటుందనీ, ఆ ప్రదేశం అంతా దాని పర్యవేక్షణలో ఉంటుందనీ కాంబోడియా దేశంలో ఓ నమ్మకం. వీటిని నాక్తా (Nak-ta) లంటారు. ఇందులో చిన్నా పెద్దా కూడా ఉన్నాయి. మాట వరసకి, కొన్ని నాక్తాలకి ఓ పల్లెటూళ్లో మరీ ఒక్క వరిచేనుమీఁదే పెత్తనం ఉంటే మరికొన్నింటి విజృంభణ ఓ రాష్ట్రం అంతటా వ్యాపిస్తుంది. కొన్ని పాతనాక్తాలు, రిటైర్డు ఉద్యోగుల్లాగ ఏ శక్తీ లేకపోయినా, మేఁవూఉన్నాం అంటూ నామకః లెక్కలోకి వస్తాయి. కొన్ని కొన్నయితే ఏ చెట్టుమీదో చెఱువు గట్టునో ఉంటూ ఆ చెట్టు పేరుతోనో, చెరువు పేరుతోనో తాము వ్యవహరిస్తాయి. ఈరకం క్షుద్ర నాక్తాలుకాక, మరోరకం స్థలదేవతలు కూడా ఉన్నాయి. ఒకానొకప్పుడు వీటికీ ఓ గుడీ, పూజా పునస్కారాలూ అంటూ ఉండేవని నిశ్చయంగా అనుకోవచ్చు. ప్రస్తుతం బొత్తిగా పాడుపడిపోయిన గుళ్లు యీరకం నాక్తాల గుళ్ళన్నమాట. వీటిలో ముక్కు మొహంపోయిన పాతవిగ్రహ శిథిలాలు కనిపిస్తాయి. ఈ నాక్తాల పూజలూ, సంబరాలూ వాటివల్ల — హైందవ సంస్కృతీ ప్రాబల్యంవొచ్చిపడకముందు వీరు పంచభూతాలనీ ఆరాధించేవారని తెలుస్తుంది.

ఈ దేవతలని ముఖ్యంగా తోటలూ, దొడ్లూ ఉన్నస్థలాల్లో, పంటలు పాడవకుండానూ, రోగాలు రాకుండా ఉండడానికి ఆరాధిస్తారు. వానలులేక భూమి బీటలువారి కరువూ కాటకంపెట్టిన రోజుల్లోనూ, అంటువ్యాధులూ, పశువులకు తెగుళ్లూ మొదలయిన జాడ్యాలు వ్యాపించినప్పుడూ ముఖ్యంగా యీ అమ్మతల్లులని "చల్ల"జేస్తారు. ఇంటిబాధలు యెప్పుడూ రాకుండా ఉండడానికని ముందుగానే మేలుకొంటారు. కాబట్టే చైత్ర, వైశాఖ మాసా

ల్లోనూ (అంటే వరిపొలాల పని ఆరంభించేముందు), జ్యేష్ఠమాసం లోనూకూడా యీ దేవతల పండుగలు యెక్కువగా జరుపుతారు.

ఈ స్థల దేవత లన్నింటిలోకీ మరీ ప్రాచీనం అయినది "బానోమ్" (B'a phnom) లో ఉన్న "మేసార్" నక్త. ఈ బానోమ్ అనేది పూర్వపు "మోతాన్" కొండఅనీ, ఐదో శతాబ్దంలో (ఏదో చైనాదేశపు లెక్క) శివుడు తన దివ్య శక్తులు యిక్కడ ప్రభవింపజేసేడనీ చైనా చరిత్రకారు లంటారు. అసలు యీ నక్తా మహిషాసుర మర్దనం చేస్తూన్న ఉమాదేవి విగ్రహం. ఇది ఆంకోర్ వాట్ (Angkor vat) శిథిలాల్లో కనిపించే శిల్పంకన్నా ప్రాచీనం అయింది అంటారు. ఈ నక్తా వుత్సవం ఏటేటా వైశాఖ పూర్ణిమకి ముందువొచ్చే శనివారం నాడు జరుపుతారు. ఈ పండుగకి యిదివరకు నరబలి యిచ్చే ఆచారం ఉండేదని — వాళ్ళ తాత ముత్తాతలు చెప్పిన ఉదంతాల ఉటంకిస్తూ — ఆ ప్రాంతంలో ముసలివాళ్ళు యిప్పటికీ అంటారు. అయితే రానురాను పశుబలి (దున్నపోతుని బలియిస్తారు) మాత్రంవే మిగిలింది. పోతుని నరకగానే రక్తం ఏదిశగా చిందుతుందో ఆవేపంతా కుంభవృష్టి కురిసి, సస్యసమృద్ధిగా ఉంటుందిట. అయితే బొత్తిగా యిటీవల రోజుల్లో ప్రత్యక్షంగా బలియివ్వడం చాలావరకూ అంతరించిపోయి, చీనా కసాయివాడిచేత పందిని కొట్టించి ఆ కొట్టినపందిని పట్టుకెళ్లి నివేదనం చెయ్యడం ఆచారం అయింది. ఈ పండుగ జేష్ఠమాసంలో జరుగుతుంది. సంబరంనాడు వొండిన అన్నం నైవేద్యంపెట్టి, ఆ ప్రసాదం ప్రతివాళ్ళకీ రంగు పొట్లాలలోపెట్టి పంచిపెడతారు.* వీటితోపాటు కోరానూలు తోరాలుకూడా ఉంటాయి. ఈ తోరాలు ఉన్నతోద్యోగుల చేతికి కడతారు. ఈలా కట్టిన తోరాలవల్ల ఉద్యోగులకీ నక్తాలకీ సఖ్యతయేర్పడి మరే చేటూకులూ ఉండవుట !

---

* ఈ పొట్లాలు పొడవుగా (Conical)గా కట్టాలిగాని, బల్లపరుపుగా (Flat) కట్టడానికి వీల్లేదు.

అన్నిటికంటే కాంబోడియాలో బాగా ప్రసిద్ధిచెందింది పుర్స్యాడ్ ప్రదేశంలో ఉన్న ఖ్లాంగ్ మురోంగ్ నక్తా. పదహారో శతాబ్దపు చివరిరోజుల్లో సెసెస్థార్ ప్రభువు, పుర్సాత్‌కి కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న బాంతేసె (Bantays. విజయదుర్గం) కోటలో ఉంటూన్నప్పుడు ఓసారి సయాంతో గొప్పయుద్ధం చేసేట్ట. యుద్ధం దారుణంగా జరుగుతోంది; ధారాపాతంగా రక్తం ప్రవహిస్తోంది; కాంబోడియన్లు ఓడిపోతున్నారు; ప్రభువు బహు ప్రమాదావస్థలో ఉన్నాడు. అదుగో. ఆసందర్భంలో ప్రభుభక్తిపరాయణుడు పుర్సాత్ గవర్నరు బలిదానం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. లోతుగా ఓ గొయ్యి తవ్వించేడు. నానారకాల ఆయుధాలూ అందులో పడేసేడు. తరవాత ప్రార్థనలూ, అవీ కానిచ్చి తానా గోతిలో దూకేసేడు. ఆయన సతీమణికూడా ఆ ప్రకారంవేచేసింది, భర్తపోయింతరవాత బతికి ఏంలాభం అని. తరవాత ఆగొయ్యి పూడ్చేసేరు. మరికొద్ది రోజులకి సయామజ్ సేనలు దుర్గాన్ని ముట్టడించేయి. కాని ఆరాత్రి ఘోరాతి ఘోరమయిన అగ్ని ప్రమాదం సంభవించింది ఆసేనల్లో – సయాంసేనలు యీగల్లా మండిపోయారు, ఆ వీరాగ్నికి ఆహుతిఅయి !

ఆ జాగాలో పుర్సాత్ గవర్నరు సమాధి వెలిసింది. అప్పట్నుంచీ యేటేటా వైశాఖమాసంలో యీ సమాధిదగ్గర అతనుచేసిన సాహస త్యాగానికి ఉత్సవాలు జరుపుతూ ఉంటారు. అయితే యిటీవల యీ ఉత్సవంన్నూ, అక్కడి భూదేవత ఉత్సవంన్నూ కలిసిపోయినాయి. ఈ సంబరంనాడు అడివి ఎద్దుకొమ్ములు పట్టుకుని, వ్రపకీడలని అనుసరిస్తూ నాట్యం చేస్తారు. వసంతానికీ, తొలకరి వానలకీ సంబంధించిన పాటలు పాడుతారు. ఇవిగాక పాతకాలపు పాటలు అనేకం పాడతారు.—

౧

“అవుగో అల్లవుగో
ఆకాశంలో మేఘాలు

ఆలకించారోదన
కీటకారణ్యంలో కీచురాళ్లు
అన్నా ఆరోహించండా కొండ
కొండలనుంచీ బండలు వొందలు
వొందలు దొర్లించండి"

౨

అవుగో అల్లవుగో
అడవియెద్దులు
గుంపులు గుంపులు
లేతపైరుల
చిగురుటాకులు
పొట్టబెట్టుకో
పయనిస్తున్నయ్
జంటలు జంటలు

3

నే కొడతా నే కొడ్తా, త
డాకా చూపిస్తా, రానీ ఆ
అడివికోతుల్ని
ఆడా మగా, ఎన్నో ! ఎన్నో !!
ఎన్నెన్నో !!!
చెట్టుచెట్టునా, కొమ్మకొమ్మనా
చట్టున గెంతుతు, బిట్టరుస్తూ
తమతమ వారికి
దానం చేస్తాయి, ఏం ?
తియ్యని పళ్ళూ
దానం చేస్తాయేం ?

౪

అయ్యో అన్నా, అయ్యో అన్నా, అన్నన్నా
కోతికూడా కొమ్మని భార్య !
కొండ కొండనా
వాగు వాగునా
కాళ్ళరగగా
తిరిగి తిరిగి మతి
చెరిగి చెదిరి నే నొక్కణ్ణే !*

కోంపాంగ్ - ఛ్నాంగ్ రాష్ట్రంలో సంబరాలకి ఎడ్లని బలి యిస్తారు. వానదేవుణ్ణి (వరుణుణ్ణి) సంతృప్తిపరచే సందర్భంలో, స్నానంచేసినట్టు చెమటలు కారేదాకా నాట్యం చెయ్యాలి. అప్పుడే వానదేవుడికి సంతృప్తి. జబ్బుపడి ఆరోగ్యం కోలుకో వలసిన వాళ్లు నైవేద్యం ఓ పళ్లెంలో ఉంచి, అడివిలో బొత్తిగా నిర్జనం అయిన ప్రదేశంలో దెయ్యాలు తినడానికి వొదిలేసిరావాలి.

కోపాంగ్ - థోమ్ రాష్ట్రంలో వనదేవతల సంబరం జ్యేష్ఠ మాసంలో జరుగుతుంది. అడివిలో ఓ ప్రధానదేవతా, ఆరుగురు చిన్న దేవతలున్నూ — ఈ ఏడుగురికీ ఏడు విగ్రహాలు. వీటికి ముందు పూజచేసి, నైవేద్యంపెట్టి, అడివిలో చెట్లు కొట్టుకోనిమ్మని ప్రార్థిస్తారు. ఈ అమ్మతల్లికి పెట్టే కానుకల్లో ముఖ్యంగా బట్టలూ, అలంకరణలూ, పౌడరూ, తలకి రాసుకునే నూనె తప్పకుండా పెట్టాలి. (ఈ నక్షత్రాలన్నీ దేవతలాయె మరి !) మధ్యాహ్నం యీ దేవతలు పూన్తారు. దేవుడు పూనినవాళ్లు, ప్రశ్నలువేస్తే జవాబు చెబుతారు.

ఇంక ఒక చిన్న సంగతి ముచ్చటించి ఈ తడవకి ముగిస్తాను. కొొచ్చిన్ చైనాలో బౌద్ధులు చెక్కిన రెండు ప్రాచీన విగ్రహాలు కనపడతాయి: ఒకటి విష్ణువు, రెండోది ఉమాను. అనేక శతా

---

* ఇది వాళ్ళ పాటకి యథా మాతృకానువాదం కాని, రాసిన పాట మాత్రం కాదు.

బ్రాల క్రితం, తమ తండ్రిదగ్గిర్నుంచి పుచ్చుకుని ఓ రాచకుమారుడూ, రాకుమార్తే వీటిని ప్రతిష్టించడానికి ఇక్కడికి వొచ్చేరనీ, అయితే ఈ స్థలం చేరుకునేలోగా పడవ మునిగిపోవడం మూలాన్న ఆ యిద్దరూ నీటిలోకి దిగి విగ్రహాలను వెతికి బయటికి తీసేరనీ ఓ గాథ.

పండుగ సమయంలో ఈ విగ్రహాలకి సారాయి అభిషేకం చేస్తారు. బాజాలు మోగుతూఉంటే నైవేద్యం పెడతారు. ఇలా ముమ్మారు నైవేద్యం పెట్టి, ఆ పెట్టిన వస్తువులు అరటి దొప్పలో చేసిన పడవలో ఉంచి నీటిలో వొదిలివేస్తారు. జబ్బులూ, యీతి బాధలూ అన్నీ ఈ పడవతో కొట్టుకుపోతాయి అని నమ్మకం. పిల్లల చేతులకీ, పశువుల మెళ్ళలోనూ తోర్గాలు కడతారు. ఈ ప్రక్రియ జరుగుతూన్నంతసేపూ బాజాలు అలా మోగుతూ ఉండవలసిందే.

# 7. రాచసేద్యం

ఇదో పండుగ, కాంబోడియాలో. ఇది వైశాఖ బహుళ చవితినాడు జరుగుతుంది. పూర్వకాలంలో యీ పండుగ అయింతరవాతకాని యెవ్వరూ పొలం దున్నేవారుకారు. కాని, యీ పండుగ బహుళపక్షంలో ఎందుకుచేస్తారో మాత్రం దురూహ్యం. నిజంగా చూస్తే కర్షకులంతా శుక్లపక్షంలో మొట్టమొదటి ఆదివారంనాడు మంచి ముహూర్తం పెట్టుకుని, ఆనాటినుంచీ తమ పొలం పనులు ఆరంభిస్తారు. ప్రభువులు స్వయంగా నాగలి చేపట్టే యీ పండుగరోజుకూడా, జ్యోతిష్కులు లెక్కలుకట్టి ముహూర్త నిర్ణయం చేస్తారు. అంతేకాకుండా, కర్షకులంతా శుక్లపక్షపు రోజుల్లోనే మంచిముహూర్తం పెట్టించుకొంటూరు; శుక్లపక్షపు చంద్రుడిలాగే వారికృషి ఫలితంకూడా దిన దినాభివృద్ధి చెందు

తుందని ఓ నమ్మకం. మరి యిన్నీ యిలాగ ఉంటూంటే, "రాచ సేద్యం"పు పండుగమాత్రం బహుళపక్షంలో ఎందుకు జరిపిస్తారో తెలియదు !

పూర్వకాలంలో ప్రభువు స్వయంగా నాగలి చేత పట్టుకుని, శుభప్రదం (ఫలప్రదం) అయిన క్షేత్రంలో లోతుగా చాళ్లు నాటే లాగ దున్నడం ఆచారం వుండేది. దీని పుట్టు పూర్వోత్తరాలు ఏంవిటి అని, విమర్శనగా చూస్తే, జనకమహారాజుదాకా వెళి పోతుంది. జనకుడు పొలం దున్నుతూ ఉండగా నాగేటిచాల్లో ఓపిల్ల దొరకడంవల్ల ఆమెకి "సీత" అని పేరు పెట్టడం, ఆతరవాత సీతారాముల కల్యాణం — యీ కథంతా చెబుతారు. హీన యాన బౌద్ధమత గ్రంథాలయితే యింకో చిత్రం అయిన గాథ చెబుతాయి. సిద్ధార్థుడి చిన్నతనం. అతనితండ్రి యీ పండుగనాడు నాగలిపట్టే సమయంలో, కొడుకుని సేవకులకి అప్పగించి, పొలం మీదికి వెళ్లేరు. వేడుక చూడ్డానికి వొచ్చిన వాళ్లకిలాగే యీభృత్యులకీ, రాచదంపతులు సేద్యకర్మ జరిపిస్తూ ఉంటే చూడా లన్న ఉత్సాహం ఇనుమడించింది. ఆపాళంగా యీ పసిపాపని ఓరావిచెట్టుకింద పడమటగా నీడలో పడుకోబెట్టి, వీళ్ళు గుంపులో దూరిపోయేరు, కాస్సేపట్లో వొచ్చేద్దాం అనీ. ఆ ఒక్క—క్షణం అలా పెరిగిపోయింది. బ్రహ్మాండం అయిన పండుగా, వేడుకాను ! వీళ్ళు కాస్తా యీ పిల్లాడిమాట మరచిపోయేరు, ఉత్సవం చూడడంలో సూర్యుడు తూర్పున ఉన్నవాడల్లా పడమటని కానవొచ్చేడు. రోజు తిరిగి పోతోంది. ఆ భృత్యులకి అప్పటికి వొంటిమీద తెలి వొచ్చింది. "అయ్యయ్యో పడమటగా నీడని పండుకోబెట్టివొచ్చేం. ఈ పడమటి సూర్యుడి ఎండలో పాపం, రాచబిడ్డ యెంత కంది పోయినాడో" అనుకొంటూ—సిగ్గుతో చివికిపోయి—పరిగెత్తు కుంటూ వొచ్చేరు. కాని ఆశ్చర్యం ! సూర్యుడు పడమటిని ఉన్న చెట్టునీడ మాత్రం సూర్యుడితో ప్రమేయం లేకుండా అలా ఆ రాచ బిడ్డని రక్షిస్తూనే ఉంది, ఎండదెబ్బ తగలకుండా !

ఆంగ్ - జుఆంగ్ ప్రభువు తరవాత వాళ్ళు స్వయంగా నాగలి పట్టి దున్నే ఆచారం తప్పించేసేరు. వ్యవసాయం చూసే మంత్రి అనుజ్ఞ పుచ్చుకుని అతని క్రింద ఉన్న ఉన్నతోద్యోగి సభార్యకంగా ఈ సేద్యకర్మ జరిగిస్తాడు. (పూర్వకాలంలో నిజంగా ఓ పొలం, ప్రాయుహోంగ్ పెగోడాకి దక్షిణంగా ప్రత్యేకించేవారు, ఈ పండుగ నాడు దున్నడానికి; కాని సిస్సావాత్ రాజుకాలంనుంచీ ఆ జాగా మారిపోయి, ప్రస్తుతం ఈ పండుగనాడు దున్నే పొలం నిర్ణీతం అయింది.)

ఈ పర్వదినంనాడు, రాచసేద్యానికి నిర్ణీతం అయిన పొలం చుట్టూ అయిదు డేరాలు వేసి, ఒక్కొక్క దాంట్లోనూ ఒక్కొక్క దేవుణ్ణి పెడతారు. తరువాత, బహుళ పాడ్యమినాడు, గోధూళి సమయంలో, భూదేవతకి "బకు" లు పూజచేస్తారు— యీ మంత్రాల తాత్పర్యం భూమి దున్నుకోడానికి దేవత అనుజ్ఞ. ఆపైన హోమవిధి అగ్ని సంస్కారంతో, జరుగుతుంది. ఇటీవల రోజుల్లో ఉన్న దేవ పంచకాన్ని స్తుతిస్తూ "బకు"లు మంత్రాలు చదివినా, హోమ కర్మ అదీ మట్టుకు లేకపోలేదు.

అయిదు డేరాలువేసి ఒక్కొక్క-దాంట్లోనూ ఒక్కొక్క దేవుడి విగ్రహం ఉంచుతారు అని పైన రాసేను. ఈ డేరాల ముందు చిన్న చిన్న యిసకకొండలు మూడు కడతారు. వీటికి శిఖరంనుంచి అడుక్కి ఓ జానెడు వెడల్పు జానెడులోతూ కన్నాలుచేసి, వాటిమీద ఆవుపేడ మెత్తుతారు; దానిమీద ముగ్గులుపెట్టి, యెత్తుగా గొడుగులు కప్పుతారు. తరవాత మంత్రోచ్ఛారణ చేస్తూ బ్రాహ్మలు ఈ రంధ్రాల్లో అగ్నిహోత్రం ఉంచుతారు. ఈ కర్మకాండంతా మంత్రాల్లో చెప్పినప్రకారం తు-చ తప్పకుండా చేయాలి. మాటవరసకి అగ్నిహోత్రానికి ఉపయోగించే సమిధలు తొమ్మిదివేళ్ళ పొడుగూ, రెండువేళ్ళ కైవారంవూ ఉండాలి. ఎక్కువ తక్కువలు పనికిరావు. తొమ్మిదేసి సమిధలు ఒక్కొక్క కట్టచొప్పున కట్టలు కట్టాలి.

మనం మామిడాకులు వాడినట్లు, కొన్ని మంగళకరమయిన చెట్ల ఆకులుకూడా నేతిలోనో, తేనెలోనో ముంచి వాడతారు హోమానికీ, హోమంలో నెయ్యి వెయ్యడానికిన్నీ. హోమం మీాద శంఖతీర్థం ప్రోక్షిస్తారు. ఈ పవిత్రకర్మ జరుగుతూన్నంత సేపూ, నాగలికి యెడ్లుపూన్చి పొలంమీాద నిలబెడతారు. ముఖ్యంగా యిక్కడ గమనించవలసిన విషయం ఏఁవిటీ అంటే, యీా పర్వదినాన్న రాజుగారు ఉపయోగించే నాగలికి రెండెడ్లు ఉంటాయి. మామూలుగా రైతులుదున్నే నాగళ్లకి ఒంటెద్దే!

తరవాత వైశాఖ బహుళ చవితినాడు "రాచపొలం" దున్న వలసిన దంపతులు తిన్నగావచ్చి వాయువ్యంగా ఉన్న డేరాలో ప్రతిష్ఠించిన శివుడికి పూజచేస్తారు. ఆపైన ఊఃశంఖాలు పూరిస్తూ వుంటే రాచసేద్యం ప్రారంభం అవుతుంది. ఆనవాయితు పోకుండా ప్రదక్షిణం చేసినట్టు ముమ్మాటు మూడు చాళ్లు గీసి విరమిస్తారు, యీా దంపతులు. ఇహనా తరవాత వెళ్ళి సపరివారంగా తూర్పున ఉన్న డేరాలోవున్న విష్ణ్వాలయందగ్గర ఆగుతారు. అక్కడ నాగలి పూన్చిన యెడ్లని విప్పేస్తారు. బ్రాహ్మలు మళ్లా మంత్రాలు చదువుతారు; ప్రభుకార్యానికి ఉపయోగించిన నాగలిమీాదా, ఎడ్లమీాదా పవిత్రోదకాలు (శంఖతీర్థం) జల్లి, ఎత్తుగా (గేలరీలా అమర్చివున్న) స్థలంవేపు మళ్ళిస్తారు ఆ యెడ్లని. అక్కడ ధాన్యం, బొబ్బర్లూ, మొక్కజొన్న కంకులూ, పచ్చిగడ్డీ, మంచినీళ్లూ, సారా అమర్చివుంటాయి (అన్నప్రాసనలో పిల్లాడికోసం అమర్చిన వస్తువుల్లాగ.) ఆ పశువులు వీటిలో దేన్ని ముడితే దానికి ఒక్కొక్క ఫలం చెబుతారు. ధాన్యంగానీ తిన్నాయంటె వరిపంట బాగుంటుంది; పచ్చిగడ్డి తింటే పశువులకి తెగులు; మంచినీళ్ళు తాగితే నాలుగుకుంచాల వర్షం, దేశంలో శాంతిన్నీ; సారాయిగాని తాగితే దేశద్రోహులూ, దొంగలూ, దుర్మార్గులవల్ల రాజ్యానికి అరిష్టం!

## వైశాఖ పూర్ణిమ

ఈ రోజున కోటలో రెండు పండుగలు ఒకేరోజున జరుపుతారు: ఒకటి శలకఫో (Salakaphot); రెండోది "విస్సాఖ్ బోసా". విస్సాఖ్ బోసా అన్నది బౌద్ధుల పర్వదినం. బుద్ధభగవానుడి జననం, జ్ఞానోదయం, నిర్యాణంవూకూడా ఈ వైశాఖ పూర్ణిమనాడే జరగడంనుంచి, దీనికి ఎంతో ప్రాముఖ్యం. * ఇహ శలకఫో అన్నది ఏంవిటి అంటే — ఆరోజున వంటకాలూ, పళ్ళూ వగైరా బుద్ధభిక్షువులకి దానం చేస్తారు. ఆహ్వానించిన బుద్ధ భిక్షువుల పేర్లన్నీ చిన్నచిన్న చీటీలమీద రాసి, ఓ చిన్న భరిణలో పెట్టి గిలకరించి, తలోక్కొక్క చీటీ తీసుకోమ్మంటారు. ఎవరిచీటి మీద ఏ బుద్ధభిక్షువుపేరు వారా బుద్ధ భిక్షువుకి వారి వంటకాలూ, పళ్ళూ వగైరా దానం చెయ్యాలి. ఈతంతు కోటలో వైశాఖ పున్నంనాడు ఉదయాన్నే జరుగుతుంది. చీటీల లాటరీ రాజుగారికీ, రాచకుటుంబానికీ మాత్రం వర్తించదు. ప్రధాన భిక్షువు పేరు ఓ చీటీమీదరాసి బంగారు భరిణలో ఉంచి తీసుకెళ్ళి రాజుగారికి యిస్తారు.

ఈ శలకఫో పండుగకి ఆధారంగా ఓ విచిత్రగాధ చెబుతారు. పూర్వం ఒకానొకప్పుడు "కాళ" భూతం *, కోర్థిడా దేవి పిల్లల్నందర్నీ భక్షించేస్తూ ఉండేదిట, ఒకరి తరవాత ఒకర్ని. చివరిసారి పురుడు పోసుకున్న తరవాత, భూతం శిశువుకోసం వెంటతరుముకు వొస్తూవుంటే, కోర్థిడాదేవి, బుద్ధభగవానుడి శరణుజొచ్చింది శిశుభిక్ష పెట్టమని. బుద్ధుడామెకి అభయం యిచ్చి, ఈ భూతానికి జ్ఞానోదయంచేసి, దాని క్రూరస్వభావం పూర్తిగా మార్చేసి, దాన్ని ఆమె దగ్గిరే ఉంచుకోవలసిందిగా కోర్థిడాదేవిని ఆదేశించేడు.

---

* ఈ వైశాఖపున్నం నాడు కోటలో ఉన్న సిల్వరు పెగోడాలోనూ, ఊళ్ళో ఉన్న యితర పెగోడాల్లోనూకూడా దీపాల తోరణాలుపెట్టి అలంకరించి బౌద్ధ గాథలూ, ప్రవచనాలూ చెబుతూ రాత్రంతా కాలక్షేపం చేస్తారు.

*L'ogresse Kala

జ్ఞానోదయం అయిన యీభూతానికి అపూర్వశక్తులు లభించేయి. దాంతో వరుణుడు ఎప్పుడు ప్రసన్నంగా ఉంటాడో తెలుసుకుని, కోల్థీడాదేవికి ఎప్పుడు వానలు పడతాయో, సేద్యం ఎప్పుడు ఎలా చెయ్యాలో అదీ యిదీ మంచిచెడ్డా సలహాలు యిస్తూవుండేది. ఆ ప్రకారం వ్యవసాయం సాగించడంతో కోల్థీడాదేవి మూడు పువ్వులూ ఆరు కాయలుగా వర్థిల్లుతూ ఉండేది. అదిచూసి అక్కణ్ణుంచీ యిరుగు పొరుగు వాళ్ళంతాకూడా, యీభూతానికి కానుకలూ, నైవేద్యాలూ అవీ పెట్టి మంచీచెడ్డా తెలుసుకునేందుకు వొచ్చేవారు. ఆ భూతం యీ కానుకలూ కట్నాలూ అవీ గంపలతో పుచ్చుకొని తనకి సరిపోగా మిగిలినవి బుద్ధభిక్షువులకి — లాటరీ వేసి — పంచిపెట్టేదిట ! అప్పట్నుంచీ యిది ఆచారంలోకి వొచ్చిం దంటారు.

ఇది మరేఁవీ లేదు, వ్యవసాయానికి సంబంధించిన పండుగ అంటారు తెలిసిన వాళ్ళు.

## 8. ఉపనయనం

ఉపనయనం అంటే ఒడుగు అనుకునేరు ! అయితే "వొడుగయితే బ్రాహ్మడు కా"డన్నట్టు, కాంబోడియాలో వాళ్లు కొంత కాలం బౌద్ధమతంలోచేరి, భిక్షువుగా ఉంటేనేగాని వీళ్లేదు మరి ! *ఈ మత స్వీకారం, ఆషాఢ బహుళ పాడ్యమి లగాయతు మూణ్ణెల్లు మినహా, మిగతా నెలలో ఎప్పుడైనా జరగొచ్చు. రాచకుటుంబంలోనైతే సాధారణంగా యిది ఆషాఢ పూర్ణిమ నాడో లేక ఆ తొలిరోజునో జరుగుతుంది.

రాచకుటుంబములోగాని లేక ఉన్నతోద్యోగుల కుటుంబాల్లో గాని యీమతస్వీకారానికి పన్నెండుగురుకన్నా ఉండడానికి

* కాంబోడియాలోనూ, వియట్నాంలోనూ కూడా (మనవేపు బ్రాహ్మణ క్షత్రియాది వర్ణాల్లాగ) వర్ణభేదం లేదు.

వీల్లేదు, ఒక్కసారిగా కలిసి యిదవాలంటేను. ఒకవేళ అలా ఎక్కువమంది గనక ఉంటే, వాళ్లు పై సంవత్సరందాకా కాసుకూర్చోవలసిందే!

ఈ కర్మకి "నాగపూజ" అని యింకో పేరు. పూర్వగాథల్ని బట్టి చూస్తే ఓ పాము (నాగులు) మనుష్య వేషంతో బుద్ధుడి శిష్యులలో జొచ్చిపోయిందట. అలా భిక్షువురూపంతో తిరుగుతూ బుద్ధుడివద్ద జ్ఞానం అభ్యసిస్తూ ఉండేదిట, మిగతా భిక్షువులతో పాటు. అలా ఉంటూవుండగా ఒకనాడు గురువులని పిలుచుకు రావలసి వచ్చింది, యీ నాగభిక్షువుకి. ఆనాడు ఎంచేతనోగాని గురువులు ఎక్కడో భూబిలంలో ఒంటరిగా ఉండిపోయేరు. ఈ నాగ భిక్షువు తన మానవరూపు కాస్తా వెంటనే మార్చి, నిజస్వరూపం ధరించి ఆ బిలంలోకి వెళ్ళింది. అయితే, పాపం, వెళుతూ వెళుతూ బిలంనిండా పొరలు ఒదిలేసింది. అదిచూసి జరిగినసంగతంతా తెలుసుకున్నారు బుద్ధభగవానుడు. మానవేతరులకి జ్ఞానబోధ పనికిరాదని శాసించేరు. కాని బుద్ధభగవానుడు కరుణామయుడు. ఈ నాగ భిక్షువు పేరు చిరకాలం నిల్చేలా వరం ప్రసాదించేరు. అంచేత యీనాటి యీ కర్మకి నాగపూజ అని నామాంతరం.

మిగతా అనేకం ఆచార వ్యవహారాలలాగే ఇదికూడా దేశంలో అక్కడక్కడ భిన్న భిన్నంగా ఉంటుంది — కొంత కొంత లుప్తమయిపోయీ, కొంత కొంత మరీ కొన్ని చోట్లా, అంత బొత్తిగా చాదస్తంకాకుండా దేశాచారాన్ని బట్టీ కాలగతిని బట్టీ మరికొన్ని చోట్లాను.

అసలు తంతు ఏఁవిటీ అంటే - ఇహ మూడు నాలుగు రోజులకి మతస్వీకారం చేస్తాడనగా, కొవ్వొత్తులూ, ఊదొత్తులూ దోసిట్లో ఉంచుకుని తల్లిదండ్రుల దగ్గర అనుమతి పుచ్చుకోవాలి. లౌక్యజీవనం విడిచి భిక్షుకజీవనం ప్రారంభించడానికి, ఇహ తరవాత కార్యక్రమం అంతా కుర్రవాడి యింట్లోగాని, లేదా బౌద్ధ పెగోడా ఆవరణలో గాని జరుగుతుంది.

కాషాయవస్త్రాలూ, భిక్షాపాత్రా, ఓచాపా, తలగడా సిద్ధపరుస్తారు యీబోయే భిక్షువు చిన్నవాడైతేను. కాస్త యెదిగినవాడయితే ఓమంగలికత్తి (ఇటీవల రోజుల్లో రేజరు), పదును పట్టేందుకు రాయీ, సూదులుకూడా పెడతారు. వీటితోపాటు పన్నీరుబుడ్లూ, తరవాత ముఖ్యంగా అరటిబోదెతోచేసి "బెయిసేన్నా ఉండాలి. ఈ "బెయిసే" నిలబెడితే వటువు కని రెప్పలదాకా రావాలి. ఈబెయిసే అన్నది అరటి బోదెతో చేస్తారు. కావలసినంత పొడుగుకోలిచి, పైనా అడుగునా మట్టంగా తెగ్గొట్టి, ముక్కోణంగా కత్తిరించిన అరిటాకు ముక్కలు 19 ♦ అలంకరించి చేస్తారు. ఈ తొమ్మిదీ తొమ్మిది మానవశక్తులకి ప్రత్యామ్నాయం అంటారు. మరి, బెయిసేకి పైభాగాన అన్నం - ఓచిన్న దొన్నెలో పెట్టి-ఉంచుతారు. దాన్ని కోణంగా మిఠాయిపొట్లాంలా ఓ అరటి ఆకు మూతపెట్టి, ఓ కొవ్వొత్తి వెలిగిస్తారు.

వటువు దీనికి ఎదరగానూ, అతని ప్రక్కన తల్లిదండ్రులూ కూచుంటారు. బుద్ధప్రవచనాలూ, నాగపూజా ఆహ్వానంవూ యిలాంటివన్నీ జరుగుతాయి. "ఆచార్యు"డు నల్లటి చెరుకుగడ ఒకటి తీసుకుని, దాని చివరనున్న ఆకులు అన్నీ ఒకదాన్తో ఒకటి మెలిపెట్టి చుడ్తతాడు. దానితో నాలుగు దిక్కులూ చూపిస్తూ, ఏవో మంత్రాలు చదువుతాడు. చివరన, యీ చెరుకాకులే ఉపయోగించి వటువు పళ్లకి నల్లగా "కప్పు" వేస్తాడు. ఇప్పుడిప్పుడీ కప్పు వేసుకునే ఆచారం నామమాత్రంగానే మిగిలిపోయింది. తరవాత అన్నం కొబ్బరికాయలోపెట్టి నాగులకి నైవేద్యం పెడతారు. చివరని తీర్థోదకాల్లో ముంచిన తోరం కడతారు వటువు చేతికి. అయితే యీ తంతులో తోటి పెళ్లికొడుకులాగ కొంత మంది వటువుచుట్టూ ఉంటారు. వీళ్ళు కొవ్వొత్తిదీపాల హారతితో వాడిచుట్టూ పంథొమ్మిదిసార్లు ప్రదక్షిణం చేస్తేనేగాని యీ కర్మ

---

♦ ఇప్పుడు 9 ముక్కలే.

కాండ పూర్తికాదు. ఓసారి కొవ్వొత్తులు ఆర్పేసి, వాటి మసితో చేసిన కాటిక పెడతారు చివరస.

మర్నాడు యీ వటువు బంధుమిత్రపరివారంతో పెగోడాకి వెళతారు. మహారాజ కుటుంబంలో పుట్టిన బుద్ధుడికి ఎంతో ఆడంబర పరిస్థితులు ఉండేవిగనక (బుద్ధుడు కాకముందు) యీ వటువుకికూడా పెగోడాకి వెళ్లేసమయములో బంధుమిత్రులంతా ఎంతో ఆడంబరంగా, దర్జాగా ఏర్పాటుచేస్తారు. ఉన్నతోద్యోగుల యిళ్ళల్లోనూ, రాచకుటుంబాల్లోనూ అయితే యీ సమయంలో ఎంతో గొప్పగా ఊరేగి, కోటచుట్టూనూ అందులో ఉన్న సిల్వర్ పెగోడా చుట్టూనూ ప్రదక్షిణాలు చేస్తారు.

బాజాలూ (ముఖ్యంగాడోలు), వెండి వస్తువులూ, కాషాయ వస్త్రాలూ, భిక్షాపాత్రా, చిత్రంగా అలంకరించిన కొవ్వొత్తి స్టాండ్లూ ముందు నడుస్తూ, అటూ యిటూ యిద్దరు ఛత్రచామరాలు పడుతూ ఉంటే తను గుర్రంఎక్కి ఊరేగుతాడు వటువు. పెగోడా గుమ్మందగ్గిర ఓబఫ్ఫూన్ (Buffoon) ఉంటాడు. వాడు మన్మథుట్ట! లోగడ బుద్ధుడి మనస్థైర్యం పాడుచేద్దాం అని తల పెట్టేట్ట! వీడు కాస్తా వటువుని అడ్డగించి సన్యసించ వొద్దని, అతని మనో నిశ్చయం పాడుచెయ్యడానికి చూస్తాడు. కాని వటువు కృతనిశ్చయుడు కనక, గుర్రందిగి, కాలు భూమిమీదపెట్టి, గంభీరంగా ప్రవేసిస్తాడు మఠం. అక్కడ లోపలగుడి చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేస్తాడు. కొంతమంది ఆ సందర్భంలో ఏమో మంత్రాలు చదువుతారంటారు కాని, సాధారణంగా శుభం భూయాత్ లాంటిది ఏదో ఒక్క ముక్క అని చాలించేస్తారు.

ఇహను, ఆ తరువాత యీ వటువు అక్కడ కొవ్వొత్తి దీపాలూ, ఊదొత్తులూ వెలిగించి, బుద్ధ విగ్రహానికి సాష్టాంగ నమస్కారం చేస్తాడు. భిక్షాపాత్రా, కాషాయ వస్త్రాలూ ముందుంచుకొని ఆసీనుడవుతాడు. అనేకులు ఒక్క

సారిగా యిదవుతే, వాళ్ల వాళ్ల యీడువారీగా కూచోవాలి. తరవాత ఆ పెగోడా తాలూకు ప్రధాన భిక్షువు వొచ్చి వీళ్ళ భుజాలమీదుగా కాషాయవస్త్రాలు కప్పుతాడు. తరవాత ఏవో కొన్ని బోధలుచేసి, ఓ మూలగాపోయి కాషాయవస్త్రాలు ధరించ మంటాడు వీళ్ళని. అవి వేసుకువొచ్చి వీళ్ళ ప్రధాన భిక్షువుకి నమస్కరిస్తే అతను మతబోధచేసి భిక్షాపాత్ర ప్రసాదిస్తాడు. అక్కణ్ణుంచీ "భవతి భిక్షాం దేహి!"

# 9. వాస్సా

ఆషాఢ బహుళ పాడ్యమి లగాయతు మూడు నెలలు బుద్ధ భిక్షువులు పెగోడాల్లోనే ఉండిపోవాలిగాని, ఊరమ్మట పర్యటించ డానికి వీల్లేదని ఓ నియమం. ఈ మూణ్ణెల్లూ "వాస్సా" అంటారు. ఈ మాట పాళీభాషలో "వస్సా"; సంస్కృతంలో వర్షంన్నా (వర్షాకాలం ప్రయాణానికి అనుకూలంగా వుండదు గనుక ఈ ఆచారం వెలిసి ఉంటుంది). బుద్ధుడే యీ నియమం చేసేడని అంటారు. ఆషాఢ, శ్రావణ, భాద్రపదాలు వర్షపురోజులు కాంబోడియాలో.

ఈ మూణ్ణెల్లూ ప్రతీ పెగోడాలోనూ "వాస్సా దివ్వె" వెలిగించాలి. దీని మట్టూ, స్టాండూ కర్రతో చేస్తారు. చక్కటి లక్కపని నగిషీతోనూ, రంగులతోనూ అందంగా శిల్ప చాతుర్యం వెలువరిస్తూ ఉంటుంది యిది. దీనిలో తేనెపట్టు కొవ్వుతో చేసిన కొవ్వొత్తి ఉంచాలని విధి నియామకం; అయితే ఛత్రం సమర్ప యామి, చామరం సమర్పయామి అంటూ అక్షింతలే వేసినట్టు, ఆ పేరు చెప్పి మామూలు కొవ్వొత్తులే వాడతారు! ఈ రోజుల్లో సాధారణంగా యీ "వాస్సా దివ్వె" అయిదువేళ్ల పొడుగు

ఉంటుంది; కొన్ని చోట్ల యీ దివ్వెమీద కొవ్వొత్తికి బదులు నూనె దీపం ఉంచడంవూ కద్దు.

ఈ వాస్సా ఆరంభంనాడు, అంటే ఆషాఢ బ॥ పాడ్యమి నాడు రాజుగారు స్వయంగా గాని, లేకపోతే రాచకుటుంబంలో తరవాత వారుగాని చాలా గొప్పగా చేసినవి అయిదు వాస్సా దివ్వెలు వెలిగిస్తారు; ఒకటి కోటలో ఉన్న పూజా మందిరంలోనూ (ఇందులో బుద్ధుడి విగ్రహం ఉంది), ఇంకోటి సింహాసనం అదీ ఉన్న కొలువు కూటానికి పక్కగా ఉన్న పితృదేవతల మందిరం లోనూ (family altar), ఇంకోటి Sacred Sword ఉన్న ఆయుధా గారంలోనూ, మరొకటి సిల్వర్ పెగోడాలోనూ ఉంచుతారు. అయిదోది ఊళ్ళోనూ చుట్టుపట్లా ఉన్న పెగోడాల వాస్సా దివ్వెల కోసం పంపించాలి (ఈ పెగోడాలూ అవీ లెక్కపెట్టి, అయిదో బాపతు పంథొమ్మిది దివ్వెలు తయారు చేస్తారు).

ఆనాడు "బకు"లు (రాజ పురోహితులు) హిందూ దేవతలకి పూజా పునస్కారాలు చేసి, మూణ్ణెల్లదాకా మరి ఆహ్వాన విసర్జ నలు లేవని విన్నవించుకుంటారు!

ఆ తొలిరోజు నుంచీ, అంటే ఆషాఢ పౌర్ణమినుంచీ, ప్రతీ పెగోడాలోనూ ఒకటే సందడీ, అడావిడిన్నీ. ఉదయాన్నే బుద్ధ భిక్షువులంతా చేరి బుద్ధత్రయాన్ని ఆరాధిస్తారు; బుద్ధ ప్రవచ నాలు పఠిస్తారు; శిష్యగణానికీ, భక్తబృందానికీ బోధచేస్తారు. పితృదేవతలకి "దా" కర్మ (తర్పణంలాంటిది) చేస్తారు. పొద్దుటి కార్యక్రమం, ఫస్టుక్లాసయిన భోజనంతో ముగుస్తుంది. ఈ విందు భోజనం (స్వాములవారిని భిక్షకోసం యింటికి ఆహ్వానించినప్పుడు చేసే విందులాంటిది) భక్తులు సమర్పించుకుంటారు. సాయంత్రం మళ్లీ మతబోధా, భక్తిగీతాలున్నూ.

మర్నాడు వాస్సా ప్రారంభం. తెల్లతెల్లవారుతూ ఉంటే "వాస్సాదివ్వె" అట్టహాసంగా పెద్ద సంబరంతో తీసుకువెళ్లి ఊరే గిస్తారు — మంత్రాలూ అవీ చదువుతూను. సాధారణంగా పెగో

డాకి ఎడంగా వెళ్లి, కుడివేపుకు తిరుగుతూ ముమ్మారు ప్రదక్షిణం చేసి మరీ ప్రవేశిస్తారు కోవెల. అక్కడ యీ దివ్వెని పవిత్రీకృతం చేసి వెలిగిస్తారు. బుద్ధ భిక్షువులంతా తమ తమ "సీనియారిటీ" ప్రకారం కూచుంటారు (ఘనా జటా చెప్పుకున్న వాళ్లు ముందూ, మామూలు బ్రాహ్మలు తరవాతా అని మన వేపు ఉన్నట్టు!). అందరిలోకి వృద్ధుడు "వాస్సారంభం" ప్రకటిస్తాడు. మిగతా వాళ్లు "తథాస్తు" అంటారు.

ఈ వాస్సామూణ్ణెల్లూ బుద్ధ భిక్షువులు పెగోడా దాటి దేశంలో తిరగడానికి వీల్లేదు. తల్లిదండ్రులకి గాని, గురువులకిగాని జబ్బుగా ఉందని తెలిస్తే మాత్రం వెళ్ళి చూడ్డానికి పర్మిషను ఉంది గాని, వారం రోజుల్లో తిరిగి వొచ్చెయ్యాలి. అలా వెళ్ళే ముందు ఏడు రోజుల్లోగా తిరిగి వొచ్చేస్తానని చెప్పి మరీ వెళ్లాలి; రాగానే గురుపాదుల దర్శనం చేసుకుని హాజరుమనవి చేసుకోవాలి. ఏదైనా కర్మంచాలక ఆ గడువులోపల తిరిగి రాలేకపోతే, శ్రావణ బ॥ పాడ్యమీ లగాయతూ మళ్ళీ వాస్సా పట్టాలి వాడు!

## కాంబోడియాలో మహాళయం:

భాద్రపద బ॥ పాడ్యమీ లగాయతు 15 రోజులు కాంబోడియాలో కూడా మహాళయపక్షం. భాద్రపదంలో ఆకాశం అంతా కారుమేఘాలు కమ్మి ఎడతెరిపి లేకుండా వర్షం అలా కురుస్తూనే ఉంటుంది; అందులోనూ బహుళ పాడ్యమీనుంచీ ప్రతీరాత్రీ (అసలే కృష్ణపక్షపు రోజులు, అందుకు తోడు ఉఃవర్షం, మేఘాలున్నూ) చిమ్మచీకట్లతో భయంకరంగా ఉంటుంది. అదుగో, ఆరోజుల్లో యమధర్మరాజు వచ్చిన వాళ్ల ఆత్మలని నేలకి పొదులుతాట్ట— కాస్సేపు బతికున్న వాళ్లతో కలిసి ఉండటానికి! ఏడు పెగోడాల్లోనూ కూడా ఎక్కడా వీటికి భుక్తి దొరక్కపోతే ఆ ఆత్మలు వాటివాటి బంధువర్గాన్ని శపిస్తాయిట. అంచేత వీటి తృప్తికోసం పిండప్రదానం చేస్తారు. పిండానికి "బెన్" అంటారు వీళ్లు.

ఈ పిండాలు - అన్నం, కొబ్బరిపాలూ, కూరగాయలూ అవీ వొండి - చేస్తారు. మధ్యని ఓ "కేకు" పెట్టి, చుట్టూ యివి ఓ పళ్లెంలో పెట్టి, ఆ పళ్లెం చిన్న స్టాండుమీద నిలబెడతారు. దానిమీద ఓ అరిటాకు మిఠాయి పొట్లాంలా కోనికల్ (Conical) గా చుట్టు కప్పుతారు. దానిమధ్య ఓ కొవ్వొత్తీ, అటూ యిటూ ఊదొత్తులున్నూ. సాధారణంగా యీ పక్షంలో పదిహేను రోజులూ, పదిహేను "బెన్" లు పెడతారు కాని, యీ ఆచారం స్థలాన్నిబట్టి మారుతూ ఉంటుంది. ఓ ఊళ్లో అయిదే బెన్లు; ఆ అయిదు ఆ ఊళ్లోఉన్న బుద్ధపంచకాని కిట. మామూలుగా వీటిని తీసుకెళ్ళి పెగోడాల్లో సమర్పిస్తారు; తరువాత పళ్ళెం అదీ అక్కడ వొదిలేసి పిండప్రసాదం మాత్రం యిళ్ళకి తీసుకుపోతారు.

భాద్రపద పౌర్ణమి మొదలు జనం అంతా ఈ ఆహుతులు సమర్పించే చోట పెగోడాలో చేరతారు. పెగోడాలో ఈ భాగం చక్కగా అలంకరిస్తారు. అక్కడ కూచుని మంత్రాలూ అవీ వింటారు. రాత్రిపూట ఒకడు డోలువాయిస్తాడు. ఆ డోలు చప్పుడు విని రాత్రి అంతా మళ్ళీ అక్కడికి చేరుకుంటారు. అప్పుడు పిండ ప్రసాదం తీసుకుని యిళ్ళకి పోతారు. అన్నట్లు, చెప్పడం మరచి పోయేను! ఈ ప్రకారం పెగోడాలోకి వెళ్ళినప్పుడల్లా ఎడంనుంచి కుడికి ముమ్మారు ప్రదక్షిణం చేస్తేనేగాని పెగోడాలోకి వెళ్ళడానికి వీల్లేదు. తెల్లవారుఝాంన బుద్ధభిక్షువులకి భోజనం పెడతారు. మధ్యాహ్నం పన్నెండు గంటల వేళప్పుడు మళ్ళీ వొచ్చి భిక్షువులకి తృప్తిగా భోజనం పెడతారు.

## కోటలో మహోళయం :

కోటలో మహోళయం బహుళ ఏకాదశినాడు జరుపుతారు. క్రిందటి మహోళయం * తరవాత పవిత్రం చేసిపెట్టిన బుద్ధమూర్తిని

* మహోళయం చివరిరోజున యీ బుద్ధమూర్తిని తీసేసి, ఇంకో విగ్రహాన్ని, మంగళ స్నానం అవీ చేయించి, వాడుకుంటారు వొచ్చే మహోళయం దాకా.

సింహాసనం అదీ ఉన్న కొలువుకూటంలో పెట్టి, అక్కడ దాని ముందు జరుపుతారు తంతు. ఆ సాయంకాలం బుద్ధభిక్షువులు అక్కడ ప్రార్థనలు సలుపుతారు; మర్నాడు ప్రొద్దున్నే నాలుగ్గంటలకల్లా వచ్చి, పదిగంటలదాకా మళ్ళీ ప్రార్థనలుచేసి, (తరవాత, వారికి సమర్పించుకున్న) భోజనం చేస్తారు. ఆ మధ్యాహ్నం ఈ జట్టు భిక్షువులు మారిపోయి, మరికొందరు వొస్తారు. చివరిదాకా యిది యిలా నడుస్తూ ఉంటుంది. త్రయోదశినాటి మధ్యాహ్నం ఆరంభించి చతుర్దశి అంతంవరకూ ♦ చివరి నలుగురు రాజుల ఆత్మల శాంతికోసం స్పెషలు మంత్రాలు చదువుతారు. ఈ తంతు జరుగుతూన్నప్పుడు రాజుగారూ, ప్రభుకుటుంబం కొలువుకూటంలో మంత్రులూ, ఉన్నతోద్యోగులూ అంతా హాజరు అవుతారు.

ఈ రోజుల్లో ఓ కోరా నూలుదారం తెచ్చి ఒక కొన ప్రధాన బుద్ధభిక్షువుదగ్గిరఉన్న పవిత్రోదకాలలోనూ, రెండో కొన పితృదేవతలు ఉన్న మందిరంలోనూ ఉంచుతారు. మంత్రాల మహిమ యీ నూలుపోగుద్వారా పితృదేవతలని చేరుకుంటుందని నమ్మకం! ఈ మహోళయానికి ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధికూడా వొచ్చి, రాజుగారితోపాటు, పితృదేవతల విగ్రహాలకి పుష్పాలు సమర్పిస్తాడు. రాచపురోహితులు మంత్రాలు చదువుతారు.

ఒకానొకప్పుడు కాంబోడియారాజ్యం బాగా విస్తరిల్లిన రోజుల్లో రాజుగారు యీనాడు తమ సంతతితో నలుగురు పిన్న వయఃస్కులకి కిరీటాలూ అవీపెట్టి, నాలుగు కత్తులిచ్చి అలంకరించి వారిని "సామంతరాజులు"లాగ ఏదో ఆర్భాటం చేసేవాట్టగాని, యిప్పుడు అదంతాపోయి, కత్తులుమాత్రం కోట మ్యూజియంలో మిగిలి ఉన్నాయి.

---

♦ Their Majesties Ang - Duong; Norodom; Sisowath and Monivong.

అదలా ఉంచగా యీ మహాళయానికి రెండు టేబిల్సు గతించిన రాజుల విగ్రహాలకి ఎదురుగావుంచి, ఓ దానిమీద వారి బంగారపు వస్తువులు (జవహరీ) అంతా పేరుస్తారు. రెండో దాని మీద వెండి వస్తువులున్నూ. ఈ రెండోదానిమీద వస్తువులు పితృదేవతల ఆత్మలకిట! కొబ్బరినీళ్లతో నింపిన కలశాలూ, కొవ్వొత్తులూ ఉండనేవుంటాయి. రాజుగారు విగ్రహాలముందు కొవ్వొత్తి వెలిగించి దీపంపెట్టి, తొమ్మండుగురు రాచపురోహితులు మంత్రాలు చదువుతూ యీ కలశాల్లో కొబ్బరినీళ్లు రాజుగారిచేత తర్పణం చేయిస్తారు. శంఖారావం విధిగా జరిగితీరాలి యీ కర్మకాండ జరుగుతూన్నంత సేపూను. తరవాత రాజుగారు పితృదేవతలకి సాష్టాంగపడతారు. ఆ తరవాత యీ ప్రకారమే రాచకుటుంబం మంత్రులూ, ముఖ్యోద్యోగులూ కూడా తర్పణాలు వొదులుతారు.

ఆపైన బుద్ధప్రవచనాలు చదివి కర్మకాండ ముగించి, యింకో బుద్ధవిగ్రహం పునీతంచేసి స్థాపిస్తారు. ఈ బుద్ధవిగ్రహం మళ్లీ మహాళయంవరకూ పనికివొస్తుంది.

ఇహ జనసామాన్యం యావన్మందికీ కూడా భాద్రపద బ॥ అమావాస్య అతిముఖ్యంఅయిన రోజు. ఆవేళ * కుడుములు వొండుతారు. వీటిని బుద్ధ భిక్షువులకి సమర్పిస్తారు; కొంతమంది బంధుమిత్రులతో సహా ఆరగించడంవూ కద్దు.

## 10. "వాస్సా" అంతం

వాస్సా మూడుమాసాలూ బుద్ధభిక్షువులు పెగోడాల్లో ఉండిపోవలసిందే కాని, మామూలుగా దేశసంచారం చెయ్యడానికి

* ఇడ్డెన్లూ కావు, అవి కుడుములూ కావు; కాని, ఆవిరిమీద ఉడకడం నుంచి అలా అన్నాను, ఆకారాన్ని బట్టీని.

వీల్లేదు. ఈ నిష్ఠ ఆశ్వీజ పున్నంతో ఆఖరు. ఈ రోజున జరిపే కార్యక్రమాన్ని "సెన్ వొస్సా" (వొస్సా ఆఖరు) అంటారు. ఆ రోజునే "బకు"లు శివ, ఉమ, గణేశ, నారాయణ, బలరాములని పూజించి, వొస్సా ఆఖరు అయింది అనీ, దేవుళ్లు బయటికి రావొచ్చుననీ విన్నవించుకుంటారు! పెగోడా లన్నింటిలోనూ బుద్ధభిక్షువులు పోగయి, వారివారి పాపచర్యలు బహిరంగంగా చెప్పి వొప్పుకుని, మన్నించమని బుద్ధభగవానుణ్ణి వేడుకుంటారు. తరవాత భక్తకోటి సమర్పించిన కానుకలూ, భోజనాదులూ స్వీకరిస్తారు (క్రిందటిసారి వ్రాసిన ప్రకారం లాటరీ పద్ధతిలో). బౌద్ధధర్మం, బుద్ధప్రవచనాలూ పఠిస్తారు. "వెస్సాంతర జాతకం"లో భాగాలు చదివి - పురాణ శ్రవణంలాగ - అర్థంచెప్పి, బోధచేస్తారు. ఈ వెస్సాంతర జాతకంలో బుద్ధుడు తాలూకు పూర్వవృత్తాంతం - అంటే తాను ప్రాపంచిక సౌఖ్యాలు వొదిలి, భిక్షువుగా మారిన సంఘటన యిత్యాదులు - ఉన్నాయిట.

ఈ ఆశ్వీజ పౌర్ణమి రాత్రి దీపాలు అరటి దొప్పల్లో పెట్టి తూంసిలాప్ నదిలో వొదులుతారు. అరటి నారతోనూ, దొప్పలతోనూ కూడా ఓ చిన్న కోనెల్లాగ కట్టి, దానినిండా దీపాలుపెట్టి ముందుగా బుద్ధత్రయానికి (బుద్ధుడు, తద్ధర్మం, భిక్షువులూ-వీటిని ఆభరణత్రయం అని కూడా వ్యవహరిస్తారు) ఆరాధన చేస్తారు.

పల్లెటూళ్లలో ప్రజలు ఈ సమయంలో ఏడాదిపొడుగునా నీటిని అపవిత్రం చేసినందుకు నదీదేవతలనీ, జలదేవతలనీ క్షమాపణ వేడుకుంటారు.

బుద్ధభిక్షువులని చక్కగా అలంకరించిన పడవల్లో కూచోబెట్టి ఉత్సవంతో నదిలో ఊరేగించడంకూడా కద్దు.

ఈనాటి జలోత్సవం గురించి అనేక గాథలు చెబుతారు గాని అందులో రెండే ముఖ్యం అయినవని వాళ్లే అంటారు. ఓ దాని ప్రకారం ఏమిటీ అంటే: బుద్ధభగవానుడి దంతం ఓ నాగుడు తీసుకుపోయి నది అడుగున దాచేసేట్ట. అంచేత నదీదేవతలని పూజ

చేసుకుని తద్వారా భగవానుడి దంతం పూజ చేసుకుంటారుట ! ఇహ రెండో దాని ప్రకారం ఏమిటీ అంటే: నాగుడి మొర్ర ఆల కించి బుద్ధభగవానుడే, జలచరాలుకూడా తరించడానికిగ్గాను ఏవో స్మృతి చిహ్నాలు నీటిలో వొదిలేడనీ, అందుకు ఈ పండుగ అనిన్నీ.

# 10. వర్షాలతరవాత

ఆశ్వీజ బహుళ పాడ్యమి లగాయతు కార్తీగ పూర్ణిమ వరకూ కాథేన్ (నీటి వేడుకలూ, పిక్నిక్కులూ) రోజులు.

ఈ కాథేన్ వేడుకలు బుద్ధుడినాటినుంచీ ఆచారంలోకి వొచ్చేయనీ, అసలు బుద్ధభగవానుడే యిలా చెయ్యవలసిందిగా ఆనతి యిచ్చేడనీ అంటారు. "వొస్సా" అనంతరం రోడ్లమీద భిక్షాటనానికి బయలుదేరిన బుద్ధ భిక్షువుల బట్టలు, బురద రోడ్లమ్మటా, వానలోనూ పడి బురద అయిపోయి పాడయి పోతాయి. అందుకని వర్షాల తరవాత భక్తులు వీళ్ళకి తిరిగీ కొత్త కాషాయవస్త్రాలు యివ్వటానికిగాను బుద్ధభగవానుడే యీ కాథేన్ వేడుకలు స్థాపించేడని చెబతారు. ఈ పద్ధతి ప్రకారం నిజంగా ఒక్క కాషాయవస్త్రాలే యివ్వవలసి ఉంటుంది, శాస్త్రాల్లో చెప్పిన ప్రకారంన్నా. కాని అసలు ఆచరణలో మాత్రం అన్నిరకాల వస్తువులూ సమర్పించుకుంటారు. భక్తులు — భిక్షాపాత్రలూ, ఆసనాలూ (కృష్ణాజినంలాంటివి), పెగోడాల్లో భిక్షువులకి ఉపయోగించే పరికరాలూ, దోమతెరలూ (ఇండోచైనా ఏమూల చూసినా దోమలు జాస్తీ!) వంటలోకి పనికివచ్చే గిన్నెలూ, తిను బండారాలూ అవీ యివీని.

ఈ కాథేన్ వేడుకలు ఎవరిమట్టుకు వారుగాని, సమూహంగా గాని జరిపించవచ్చును. సాధారణంగా పదిమందీ కలిసి చేస్తూ ఉంటారు. మాటవరసకి ఓ సంస్థలో పనిచేసేవాళ్ళందరూ ఏక

మొత్తం అంతా, యీ వేడుక జరిపించి, వస్తువులు సమర్పించు కుంటారు - వాళ్ళ వాళ్ళ తల్లిదండ్రులూ, స్నేహితులూ కూడా పాల్గొనవచ్చు. ఆయా స్థలాల్లో ఆర్థికంగా బాగా వెనకపడిన పెగోడా ఒకటి చూసుకొని అక్కడ భిక్షువులని ఆహ్వానించి, గౌర వించి, ఈ కాథేన్ వేడుక జరిపిస్తారు. ఒక ఏడాది ఒకే పెగోడాలో రెండు కాథేన్ వేడుకలు జరగడానికి వీల్లేదు; జరగవుకూడాను.

ఇలా పెగోడా నిర్ణయంచేసుకున్ననాటికి ముందురోజున కానుకలన్నీ ఒకచోట చేర్చి, పళ్ళేల్లోనూ వాటిల్లోనూ పెట్టి బాజా లతో ఊరేగిస్తారు. ఊరేగింపుసమయంలో కానుకలమధ్య ఒక గిన్నె (పెద్దదే, బేసినుకీ గిన్నెకీ మధ్యరకంలో ఉంటుంది); ఊరేగింపు జరుగుతూన్నప్పుడు, దారినిపోయేవాళ్లు యథాశక్తి వాళ్లకి తోచి నది వెయ్యడానికని ఉంచుతారు. ఈ ఊరేగింపు అంతంఅయ్యేచోట ప్రార్థనలూ, పగటివేషాలూ, పాటలూ యింకా అలాంటి వేడు కలూ జరుపుతారు.

ఇహ మర్నాడు ఉదయాన్నే ప్రతివాడూ అక్కడికి చేరుకో వాలి, పిక్నిక్కుకి వెళ్ళడానికి. చక్కగా ముస్తాబై వొస్తారు పెళ్ళికి వెళ్ళినట్టు; తీసుకువెళ్ళవలసిన వొస్తువులూ అవీ ఉంచిన బళ్ళు ముచ్చటగా అలంకరిస్తారు (పల్లెటూళ్ళలో అయితే యింత అట్టహాసం ఉండదుగాని, అక్కడవాళ్లు ట్రెయిలరులాంటి దానిమీద యీ వొస్తువులన్నీ పెట్టి ఓ సైకిలుకి కట్టి లాగించి ఊరేగిస్తారు. ఈ సందర్భంలో వాళ్లు పచ్చని వరిచేలరంగు గల బట్టలూ, రంగు రంగుల గొడుగులూ వేసుకునివస్తారు, గుంపులు గుంపులుగాను).

ఆ తరవాత పెగోడా చేరుకున్నాక కుడినుంచి ఎడమకి ముమ్మారు ప్రదక్షిణం చేస్తారు, మనం కోవెల్లోచేసినట్టుగా నేను. అయితే ఈ ప్రదక్షిణం చేస్తూన్నప్పుడు బాజాలుకూడా ఉండాలి. ఈ బాజాల్లో ముఖ్యం అయింది "సాయాం." ఇది మన మృదంగం మోస్తరుగా ఉంటుంది కాని, సైజులో అంతకన్న పెద్దది. దీన్ని పాము తోలుతో మూస్తారు; పైన రంగుగుడ్డల తొడుగున్నూ.

వాయిద్యగాళ్లు చేతుల్లో యీ "సాయాం"లు వాయిస్తూ ఉంటే, మిగతావాళ్లు ఆ "లయ"కి అనుగుణ్యాంగా గెంతుతూ, కేకుతూ నాట్యం చేస్తారు; పాటలు పాడతారు.

ఈ తతంగం అంతా అయింతరవాత కోవెలలో ప్రవేశిస్తుంది. ఆసరికి అప్పుడే బుద్ధభిక్షువులు అక్కడ ఉంటారు. వాళ్ళ ముందు ఈ పట్టుకెళ్ళిన కానుకలన్నీ పేరుస్తారు; భక్తులు బుద్ధభగవానుడి విగ్రహానికి సాష్టాంగపడతారు; బౌద్ధమత ధర్మాలు వింటారు. అంతలో ఓ భిక్షువు వొచ్చి ఈ భక్తులు సమర్పించిన వస్త్రాలు కొలుస్తాడు, పొడుగూ, వెడల్పూ శాస్త్రసమ్మతంగా ఉన్నాయో లేదో అని! ఆ తరవాత ఓ బ్రాహ్మడు (వీడు బౌద్ధుడు కాడు!) వొచ్చిన అందరి తరఫునా వినయ విధేయతలతో యీ వొస్తువులు సమర్పిస్తాడు బుద్ధభిక్షువులకి. వాళ్లు ఆశీర్వదిస్తారు, వొస్తు స్వీకారం చేసి.

ఆపైన "ప్రీతిభోజనం." ఈ వంట చాలా చక్కగా, ఎంతో శ్రద్ధాభక్తులతో వొండుతారు. అయితే యీ భోజనానికి బుద్ధభిక్షువులూ, యీ "కాథేన్" ఆర్గనైజుచేసినవాళ్లే కాని మిగతావాళ్లు ఎవ్వరూ సహపంక్తిని కూర్చోడానికి వీల్లేదు. ఈ ప్రీతిభోజనం ఏడాదిలో వొచ్చే అన్ని పండుగులకంటే కూడా ఎంతో ఎక్కువగా ఆనందిస్తారు. ఇహ తిరిగి వొచ్చేస్తూన్నప్పుడైతే యువకుల పాటలూ, కేరింతాలూ మైలు దూరానికి వినిపిస్తాయి!

ఇహ కార్తీక పున్నమనాడయితే కాంబోడియాలో ఎంతో ప్రసిద్ధికెక్కిన "జలోత్సవం" (Fite des Daux). ఏదో ఓ గాథ ఆధారంగా లేనిదే ఏ పండుగూ లేనట్టు కనిపిస్తుంది యీ దేశంలో. (మన దేశంలో మట్టుకు ప్రతీ వ్రతానికీ, ప్రతీ నోముకీ ఓ కథ లేదూ?) మోనాక్ (లాఓస్)లో ఉన్న "నిమ్మోతా" నది ఒడ్డున యిసకలో బుద్ధభగవానుడు నడిచివెళ్లేడనీ, ఆ అడుగుల జాడలు జ్ఞాపకంపెట్టుకుని వాటిని పూజించడానికి యీ "జలోత్సవం" అంటూ ఓ అవకాశం కల్పించేరని అంటారు కొందరు; మరికొందరు

"అబ్బే, అది ఏంవీకాదు. అసలు బుద్ధభగవానుడే ఓ బోటుబ్రిడ్జి కట్టించేడు; వైశాలీరాజ్యంలో క్షామం అనే మాట లేకుండా కాస్తూ ఉండేది యీ బ్రిడ్జి; కాబట్టి యీ జలోత్సవంనాడు పడవల మీద గుంపులు గుంపులుగా వెళ్లాలి" అంటారు. నాగరాజుకి బుద్ధ భగవానుడు ప్రసాదించిన దంతం, తాను జలాంతర్భాగంలో కదా ఉంచేడు, అందుకని యీ ఉత్సవం అని ఇంకొందరు. అసలు ఏడాది పొడుగునా రహదారి పడవలు - మీకాంగ్ నదిలోనయితేనేం, తోంవిసావ్ నదిలో నయితేనేం - బౌద్ధాలయాల ఆవరణల్లో ఉండి పోతాయి. ఇహ వీటెని మళ్లీ నీటిలో వొదిలినప్పుడు పెద్ద సంబరం చెయ్యాలి. అదుగో అదే యీ సంబరం. ఇలా అనేక రకాలు.

ఇక్కడే ఓ ముచ్చటకూడా చెప్పాలి. స్థలదేవతల్లాగే జల దేవతలుకూడా ఉన్నారు. వీళ్లు ప్రతీ పడవనీ ఆవహించి, ఆ పడవ కలవాడికి ఐశ్వర్యం, ఆరోగ్యం చేకూరుస్తారు. వీటి ప్రభావం అంతా పడవ "సైడు"న ఉంటుంది. పడవని జాలారోహణం చేస్తూ, శంఖారావం అదీచేసి, మంత్రాలు చదువుతూ ఉంటే యీ దేవత పూనేస్తుంది పడవవాళ్ళకి. ఆమట్టుగా వాళ్లు ఒక్క సారిగా పడవలోంచి నీళ్ళలోకి దూకి యీదుతూ, కేకుతూ, వాగుతూ నానా గల్లంతూ చేస్తారు. ఒక్కొక్కప్పుడు వీళ్ళ చేతులకి నూలు తోరాలో, లేకపోతే చేతి రుమాల్లో కడతారు, మంత్రించి అలా కడితే మంచి లాభం రావడంవే కాకుండా, పడవ ఏ దిక్కున పోయినా మరి ప్రమాదం ఉండదు!

ఈ తతంగం అంతా సాయింకాలం జరుగుతుంది. ఆనాటి ఉదయాన్నే పెద్దవి రెండు గిల్టు కళ్ళు తయారుచేసి పెగోడా శిఖరం మీద ఉంచుతారు. సాయంకాలం బాజాభజంత్రీలతో మేళం జరిగించి, ఆ తరవాత మూడుసార్లు "పొలి" కేకపెట్టి, అన్నిటికన్నా పొడుగాటి పడవని ముందు నీళ్ళలో వొదులుతారు.

నాంపెన్‌లోనయితే బోట్ రేసులు జరుగుతాయి యీనాటి నుంచి మూన్నాళ్ళు. పడవలనిండా దీపాల తోరణాల అలంకరణ.

ఈ పడవలో దీపాలు రాజుగారు స్వయంగా వెలిగించడం ఆచారం. నదినిండా యీ దీపాల పడవలు రేసుల్లో తిరుగుతూ ఉంటే ఆ ప్రతిబింబాలతో నది ఎంతో ఆకర్షంగా ఉంటుంది. మూడురోజులూ రాజుగారు యీ రేసులు చిత్తగిస్తారేమో, ఊళ్ళో జనం అంతా నదిఒడ్డునే ఉంటుంది. ఇహ కోలాహలం చెప్పనేలఅక్కర్లేదు.

కార్తీగపున్నంనాడు రాజుగారు తూంవిసావ్ నదిమీద ఉన్న Floating house లో నుంచి చంద్రుడికీ, జలదేవతలకీ ఓ నమస్కారం చేసి, వెన్నెట్లో మిలమిల మెరుస్తూన్న నీళ్లతో చేతులూ, మొహం కడుక్కుని శివుడికి అత్యంత ప్రీతయిన మారేడుదళంతో ఆ నీళ్ళు తమ పిల్లల శిరస్సున ప్రోక్షిస్తారు.

# 11. రాజుగారు పుట్టినరోజు

రాజుగారు పుట్టినరోజు పండుగ సాధారణంగా అయిదు రోజులు జరుగుతుంది. అయితే, రాజుగారు పుట్టిన సంవత్సరానికి ఏ జంతువు అధిపతో, ఆ జంతువు తాలూకు వర్ష పంచకంలో, యీ పుట్టినదినపు పండుగ వారంరోజులు జరుపుతారు. (అరవై సంవత్సరాలు పన్నెండు భాగాలుచేసి, ఒక్కొక్క భాగానికి చెందిన అయిదుపళ్ళకీ ఒక్కొక్క జంతువు అధిపతి అని లోగడ రాసేను) ఈ అయిదురోజుల్లోనూ నాలుగోనాడు రాజుగారు పుట్టిన తిథికో సరిపోతుంది, చాంద్రమానం ప్రకారంన్నూ. ఈ పుట్టిన దినపు పండుగ రాజుగారు దీర్ఘాయుష్మంతులు కావాలనీ, అలా మతాధిపతులూ, బుద్ధత్రయం ఆశీర్వదించాలనిన్నీ వాడుకలోకి వొచ్చింది.

ఈవేడుక అన్నాళ్ళూ దివానూ, యితర బొక్కసపు అధికారులూ కలిసి, రాజుగారి ఆభరణాదులన్నీ "ఎగ్జిబిషన్" పెడతారు. ఈ "ఎగ్జిబిషను" కోటలోనే ఓ భాగంలో పెడతారు. సిహానోక్

ప్రభువు కాలంనుంచీ, ఆభరణాదులే కాక, దేశంలో గల చిత్రవిచిత్ర వస్తుసముదాయం అంతాకూడా "ఎగ్జిబిషన్"లో పెట్టడం ఆచారం అయింది. అంతేకాకుండా సాయింకాలం చీకటి పడ్డాక కోట ఆవరణప్రాంతాల్లోగాని, నది ఒడ్డునగాని రంగు రంగులవీ, తమాషా అయినవీ ఎన్నోరకాలు పటాకీలు కాల్చడం కూడా ఆనవాయితీ!

తొలినాటి సాయింకాలం సింహాసనంవ్రూ అదీ ఉన్న కొలువు కూటంలో ప్రభువులు "విజయదీపిక" (Le Cierge dela Victoirer) వెలిగిస్తారు. తేనెపట్టు కొవ్వుతో చేసిన యీ దీపం పదిహేనుపౌన్లు బరువ్రూ, మూడడుగులు పొడుగూ ఉంటుంది. మట్టు డయామీటరు పది సెంటిమీటర్లు. ఈ లెక్కలూ, తూకాలూ అన్నీ సరిగ్గా సరి పోతేనేగాని ఆ దీపం ఈ పుణ్యసమయానికి పనికిరాదు!

దీన్ని ఓ చిన్న వెదురుబొంగు మట్టుమీద నిలబెట్టి, ఆపా శంగా దాన్ని ఓచిన్న పాలవెల్లిలాంటిదాన్లో పెడతారు. ఈ పాలవెల్లి ముందు సుఖాసీనుడయి, బౌద్ధస్వాములవారు రాజుగారికోసం నిరీ క్షిస్తూ ఉంటాడు. తరవాత ప్రభువులూ, ఆయనవెంట చక్కగా అలంకరించిన గిన్నెలో కొవ్వొత్తిపెట్టి పట్టుకుని పరిచారకుడూ ప్రవేశిస్తారు. ఆ తరవాత స్వాములవారు "విజయదీపిక" వెలిగించి బుద్ధభగవానుడి కృపాకటాక్షాలు రాజుగారియందు కలగవల సిందిగా ప్రార్థిస్తాడు (ఈ విజయదీపికతోనే యింకో పెట్రోలు లాంతరుకూడా వెలిగిస్తారు; ఓవేళ ఏ కారణంచేతనయినా యీ దీపిక అయిపోయినా, ఆరిపోయినా రెండోది అలా వెలుగుతూ ఉండడానికి!) అఖండ దీపంలాగ యిది వెలుగుతూన్న అయిదు రోజులూ రాజుగారు కోటదాటి బైటికి వెళ్ళడానికి వీల్లేదు. ప్రార్థ నలూ బుద్ధప్రవచన పఠనంవ్రూ అయింతరవాత, కోటలో ఉద్యోగు లంతా అక్కడున్న చిన్న చిన్న దీపాలు వెలిగిస్తారు.

మొదటి మూడురోజులూ ప్రార్థనలూ అవీ జరుగుతాయి. ఈ ప్రార్థనలు చెయ్యవలసిన బుద్ధభిక్షువులకీ ఒక లెఖ్ఖ! రాజు

గారికి ఎన్నేళ్లుంటే అంతమందీ + మరొక్కడూ!! ఈ మొత్తం భిక్షువుల జనాభా మూడు రోజులకీ సద్ది, ఆ ప్రకారం ప్రార్థనలూ అవీ జరిపిస్తారు. ముందునాడు ప్రార్థనజరిపిన వాళ్లందరికీ మర్నాడు ఉదయాన్ని ప్రభువులు విందుచేస్తారు, యీ మూడు రోజులున్నూ.

ఇలాగ్గానే రెండో రోజు ఉదయం, తొలిరోజు భిక్షువులకి సంతర్పణ జరుగుతుంది. ఆ మధ్యాహ్నం మళ్లీ బుద్ధభిక్షువులు ప్రార్థనలు జరుపుతారు; కాని యీ తంతులో తురకల ప్రార్థనలు కూడా ఉంటాయి, యీ రెండో రోజున! మహమ్మదీయులూ, బుద్ధభిక్షువులూ కలిసి సింహాసనం చుట్టూ తిరుగుతూ (ప్రదక్షిణం లాగ) ప్రార్థనలు చేస్తారు. *బ్రాహ్మలకీ, బుద్ధభిక్షువులకీ, మహమ్మదీయులకీ అందరికీ కలిపి మర్నాడు విందు!

ఇహ నాలుగోనాడు – ఆవేళ నిజంగా తిథిప్రకారం రాజుగారి పుట్టినరోజు. ఉగాదినాటికి మల్లేనే ఆవేళ ప్రభువులు పవిత్రోదకస్నానం చేస్తారు. ఇరవైయొక్కసారి ఫిరంగులు పేలుస్తారు, యీ స్నానకర్మ జరుగుతూఉంటేను. ఆ తరవాత ప్రజలూ, విదేశీయులూ వొచ్చి రాజుగారికి తమ శుభాకాంక్షలు తెలుపుకుంటారు.

అయిదోనాడు, రాచకుటుంబంలో వాళ్లకి, సిల్వర్ పెగోడాలో బుద్ధ ప్రవచనాలు పురాణశ్రవణం! ఆవేళ సిల్వర్ పెగోడాలో పంచక్షేత్ర విగ్రహాలూ (శివ, ఉమా, నారాయణ, గణేశ, బలరామ విగ్రహాలు), పవిత్ర కరవాలమూ తెచ్చి ఉంచుతారు. వాటికి పక్కగా అయిదు నీటి కలశాలూ, పదహారు చిన్న కలశాలూ ఉంచుతారు. ఎనమండుగురు భటులని తీసుకువచ్చి గోడ దగ్గిర రెండువరసల్లో కూచోపెడతారు. వీళ్లకి, యిద్దరిచేతుల్లో దండాలూ, నలుగురి చేతుల్లో కత్తులూ, యిద్దరికి తుపాకులున్నూ,

---

* కాంబోడియా రాజ్యంలో "చామ్స్" (Chams) అనే మహమ్మదీయులుకూడా ఉన్నారు. చాంపా ప్రాంతం నాశనం అయిపోయినప్పుడు వీళ్లు కాంబోడియా (ఖ్మేరు) దేశంలో శరణుజొచ్చేరుట!

కోటలో ఉన్న ఉన్నతోద్యోగులు వీళ్లకి ధౌతవస్త్రాలు యివ్వాలి. తరవాత బ్రాహ్మడు (రాజపురోహితుడు) మంత్రాలు చదువుతాడు. ఆ సింహాసన ప్రాంతానికి అధిపతి అయిన "నక్తా" (స్థల దేవత) సంతోషించి, యిహ ఏ తేడా లేకుండా కాపాడుతుంది, రాజుగార్ని కోటనీన్నీ ! ఆ తరవాత యిద్దరు రాజపురోహితులు, ఒకడు బల్లెం పుచ్చుకునీ, రెండోవాడు కత్తిపుచ్చుకునీ, ముమ్మారు కలశోదకాల్లో ముంచి, ఏవో వికారచేష్టలు చేస్తారు. దాంతో పటాపంచలైపోతుంది !

తరవాత ఒకడు మంత్రాలు చదువుతూ ఉంటే, మిగతా వాళ్ళు ముక్క ముక్కా సంత చెప్పినట్టు రెండుసార్లు పునరుచ్చారణ చేస్తారు, - కలశాల్లో ఉన్న పవిత్రోదకాలు తీర్థం పుచ్చుకుంటారు.

ఆ మధ్యాహ్నం ఈ మంత్రాలూ అవీ కేవలం కోటలో ఉన్న జనానికి చదివి వినిపిస్తారు. ఈ పూట మిగతా ఉద్యోగస్థుల ఆడవాళ్ళుకూడా రావొచ్చునుగాని, మొగ పురుగు అన్నవాడు ఉండడానికి వీల్లేదు మరి, ఒక్క పురోహితులు తప్పించీ !!

తదుపరి, బౌద్ధస్వాములవారి సమక్షంలో రాజుగారు "విజయదీపిక" ఆర్పేస్తారు. అయితే దీనికిముందు, ఈ దీపంతో యింకో చిన్నదీపం వెలిగించాలి. ఆ చిన్న దీపం, ఆ తరవాత, తమలపాకులు మడిచి పట్టుకుని, ఆ ఆకుల మడతలతో ఆర్పాలి ! కాని సాధారణంగా జరిగేది ఏంవిటంటే, చిన్నదీపం ఆకులమడతలతో ఆర్పేసి, పెద్దదీపం దానంతటదే ఆరిపోయేదాకా ఊరుకుంటారు.

## 12. గాలిపడగలు

**కాం**బోడియాలో గాలిపడగలకీ ఓగాథ; ఓతంతున్నూ. గాలిపడగలు ముఖ్యంగా మార్గశిరమాసంలో ఎగరెయ్యాలని విధి.

మార్గశిర పున్నంనాటి రాత్రి, సింహాసనం అదీవున్న కొలువు కూటంలో బుద్ధభిక్షువులకి పెద్ద విందుచేసి, మంత్రులతో సహా రాజుగారు స్వయంగా గాలిపడగలు ఎగరవెయ్యడం ఆచారంగా ఉంటూవుండేది. ఆ సందర్భంలో ఏవో మంత్రాలూ, బుద్ధభిక్షువులు ప్రవచనాలు చదవడం అదీ యిదీ ఉండేదిట గాని యిప్పుడవన్నీ పోయి, ఊరికే సరదాగా గాలిపడగలు ఎగరవేసుకోవడం మాత్రమే మిగిలిపోయింది. కానయితే మార్గశిరమాసంలో గాలిపడగలు తప్పకుండా ఎగరవేస్తారు, పిన్నా పెద్దా కూడాను !

వీళ్ళ గాలిపడగలు మన గాలిపడగల్లా మాత్రం ఉండవు. T ఆకారంలో పల్చని వెదురుబద్దలతోనూ, కాగితంతోనూ కట్టుకుంటారు, వీటికి ముందుభాగాన కొబ్బరి ఆకో, అలాంటిది మరేదో (చిన్నపిల్లలు బూరాలకిఉండేలాంటిది) పెడతారు. గాలికి ఎదురుగా గాలిపడగ వెళుతూఉంటే జోరుగావీచే గాలి మూలాన్ని యీ కొబ్బరిఆకు ఊఃశబ్దం చేస్తుంది, కీచుమంటూనూ !

గాలిపడగలే కాకుండా యీ రోజుల్లో వీళ్లు బుట్టదీపాలు కూడా ఎగరేస్తారు (వీటిని మనవేపు ఆకాశదీపాలని కాబోలు అంటారు).

గాలిపడగలు ఎవరిమట్టుకు వారు ఎగరేసుకోవడం అలా వుండగా, మనవేపులాగే పోటీలుకూడా ఉన్నాయి. ఎవరి గాలిపడగ ఎక్కువ శబ్దం చేస్తోందీ అన్నది ఒకరకం పోటీ; ఎవరిది ఎంత ఎత్తు ఎగిరిందీ అన్నది యింకోరకం; ఈ పోటీలో గెలవడానికి బలంగాఉన్న నైలాన్‌దారంలాంటి దారం ప్రత్యేకించి తెచ్చుకుని, గాజుముక్కలు గుండనూరి, ఆ పొడి బంకలోకలిపి యీ దారం అందులో నానపెట్టి — యిలా నానాఅవస్థలూ పడతారు, పోటీదారుల పడగ తెంపెయ్యడానికి ! రెండు పార్టీలవాళ్లు యీ పోటీలు జరుపుతూఉంటే, వేడుక చూడ్డానికి విరగబడిపోతారు జనం ! !

ఈ సందర్భంలోనే, వాడుకలోఉన్న ఓ చిన్న కథచెప్పి ఈ ప్రసంగం ముగిస్తాను. "త్మైన్చె" అనే కాంబోడియా నాయకుణ్ణి చైనాదేశపు చక్రవర్తి . ఓసారి ఖైదుచేసి, మరి విడుదలచేసేడు కాడుట ఎన్నేళ్ళయినానూ- ఓకుర్రాడు ఆపాళంగా ఓ గాలిపడగ చేసి రాజుగారి కోటమీద ఎగరేసేట్ట - రాత్రల్లా అది ఊః సైరను లాగ కీచుమని గోలచేస్తూ కోటమీద ఎగురుతూనే ఉంది. ఆగోల ఏంవిటో ప్రభువులకి అర్థంకాక, పురోహితులనీ, జోతిష్కులనీ పిలి పించి అడిగేరు. "ఇదేదో అపశకునపక్షికూత, స్వామీ! గొప్ప విపత్తు ఏదో రాబోతూంది. ఎందుకయినా మంచిది ఆ "త్మైన్చె"ని వొదిలెయ్యండి, తశ్శాంతి కలుగుతుంది" అని చెప్పేరు. జైల్లోంచి బయటికివొచ్చి, రాజుగారికి అసలుకిటుకు తెలియబరచి, రాత్రికి రాత్రి ఉడాయించేసేడు, "త్మైన్చె", కోటలో ఉన్న నెండి బంగా రులూ, ఆభరణాలూ పడవల్లో సర్దుకునీ !!

## సర్వపాప పరిహారార్థం !

నిజంగాచూస్తే "సెయిమాలు" ఉంచడం ఏటేటా వొచ్చే పండుగల లిస్టులో చేర్చడానికి పీలులేదు గాని, కాంబోడియాలో చాలాచోట్ల యిది సాధారణంగా చైత్రమాసంలో జరుపుతూ ఉండడం మూలాన్ని, యీ బాపతుకూడా కాస్త రాస్తాను, మరి. ఇలా రాయడానికి కారణంకూడా లేకపోలేదు. ఈ"సెయిమా"ల ఉత్సవం కాని జరిపిస్తే చేసిన పాపాలన్నీ ఒక్కదెబ్బతో తుడుచుకు పోతాయని, గొప్పనమ్మకం వీళ్లకి. అంచేత యిది ఎంతో శ్రద్ధా భక్తులతో చేస్తారు.

బుద్ధ దేవాలయంలో తొమ్మిది సెయిమా లుంచాలి; యిందులో తొమ్మిదోదాన్ని బుద్ధవిగ్రహానికి ఎదరగా భూస్థాపితం చేస్తారు. 'ఈ సెయిమా' లన్నవి ఓరకం దుంపలు (ఆకులంతో సహా తీసుకువస్తారు—— కందా బచ్చలి నోముకి కంద మొక్క తీసుకువొచ్చి నట్టు!). ఈ దుంపలమీద కళ్లూ ముక్కూ అవీ పెట్టిగాని, గీసిగాని,

వీటికి దేవతాస్వరూపం ప్రసాదిస్తారు. ఈ బొమ్మ దేవుడిచేతుల్లో ఓ కలవపువ్వు!!

అసలు మొట్టమొదటి బుద్ధదేవాలయం కట్టినప్పుడు — బుద్ధుడికాలంలో — ఇంద్రుడు స్వయంగా వొచ్చి అక్కడి ముఖ్య సెయిమాకి కాపలాకాసేట్ట! అంచేత యిప్పటికీ, తొమ్మిది సెయి మాల్లోనూ ఓదాన్ని "ఇంతొకెల్" (ఇంద్రుడి సెయిమా)అంటారు. ఈ ఇంద్రుడిసెయిమాకి పెద్ద దుంపాఅదీ — కొన్ని ప్రత్యేకతలు ఉంటాయి, మరి!! ఈ సెయిమాలు, పూజలూ పునస్కారాలూ అయిన తరవాత ప్రత్యేకించీ తవ్వినగోతుల్లో భూస్థాపితం చెయ్యాలి.

సెయిమాల పూజ మూడురోజులు రాత్రింబగళ్లు జరుగు తుంది. దీనికి అథమపక్షం యిరవైఒక్క బుద్ధభిక్షువులని పిలవాలి; యీ యిరవైయొక్కమందీ యిరవైయొక్క దేవాలయాలనుంచీ ఉండాలిగాని, ఒకదేవాలయంలో ఉన్నవాళ్లని ఏకమొత్తంగా పిలవడానికి వీల్లేదు. వీళ్లు కాక, తొమ్మండుగురు బ్రాహ్మలు (ఆచార్యులు) ఉండాలి. ముఖ్యంగా యీ బ్రాహ్మల్ని దేవతల తృప్తికోసం పిలుస్తారు. తొమ్మిది సెయిమాలలోనూ ఒకటి యమధర్మరాజుకోసం; ఓ బ్రాహ్మణుడు ఆ సెయిమా పూజా అదీ చూస్తూఉండాలి.

ఈ సెయిమామీద భక్తకోటి పుష్పాలూ అవీ ఉంచి పన్నీరూ అదీ జల్లుతారు. దీనికి ముందు వీళ్ళంతా పెద్ద ఊరే గింపులా వెళ్లి, కోవెలచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచెయ్యాలి. రెండోరోజున భక్తులంతా భిక్షువులకి కానుకలు సమర్పించు కుంటారు. మూడోరోజు ఈ సెయిమాలు భూస్థాపితం చెయ్య డానికి గోతులూ అవీ తవ్వుతారు. వీటిలో భక్తులుఅంతా యథా శక్తీ, యథాభీష్టంగా నగలూ, వంటసామాన్లూ, జుట్టూ, వగైరాలు పడేస్తారు. జుట్టుగాని యిలాగ సమర్పిస్తే వచ్చే జన్మంలో తుమ్మెదరెక్కలా నల్లగా నిగనిగలాడుతూ పెద్ద జుట్టు వస్తుందిట!

వేలు కొంచెంకోసి నెత్తురుకానీ సమర్పిస్తే మళ్లీ జన్మలో సిరిసంపద లతో తులతూగుతారు. సింహంఅంత బలపరాక్రమాలు వస్తాయి!!

ఈ గోతులమీద చిన్న మట్టులాగ కట్టి వాటిమీద అడ్డంగా పుల్లలుంచి, ఆ పుల్లలకి యీ సెయిమాలు వేలాడదీస్తారు. ప్రార్థనలూ అవీ అయినతరువాత బ్రాహ్మలు యీ సెయిమా లని భిక్షువులకి వప్పజెబుతారు. ఓ బెత్తాంతో యీ సెయిమా లుంచిన చోట భూమ్మీద రెండు కాళ్లూ (పాదాలు) పట్టే టంత విశాలంగా చిన్న చిన్న నలుచదరాలు గీస్తారు, ఏవో మం త్రాలు చెబుతూను– ఈ నలుచదరాలు గియ్యడం పూర్తవడంతోనే అంతా మడిఅన్నమాట. అప్పట్నుంచి బ్రాహ్మలకి ఒక్కటేపని —పశువులు ఏవీ కోవెల ఆవరణలోకి రాకుండా తోలుతూ కూచోడం! అప్పట్నుంచీ కార్యకలాపం ముగిసేలోపున ఏదైనా జంతుప్రాణిగానీ కోవెల్లో అడుగుపెట్టిందా, మడి తగులబడి పోయి, తంతంతా మళ్ళీ ప్రారంభించవలసిందే మొదటిదగ్గర్నుం చిన్నీ !!

ఇహ అంతలో, బ్రాహ్మలు భిక్షువులని తోడ్కుకుని వెళ్ళి సెయి మాలు ఒక్కటి ఒక్కటి యిది ఫలానా యిది ఫలానా అని చూపించి చెప్పాలి. తరవాత భూస్థాపితం చేసినప్పుడుకూడా సెయిమాలన్నీ ఒక్కమారు భూస్థాపితం కావాలికాని, ముందూ వెనకా కాకూ డదు; అందుకని సెయిమాలు వేలాడదీసిన గోతులదగ్గిర బ్రాహ్మలు సిద్ధంగా కూచుంటారు, కత్తెరలు పట్టుకుని. ఆవరణలోంచి డోలు వాయిస్తారు. మొదటిసారి డోలుమీద దెబ్బపడగానే, కత్తెరలు సిద్ధంగా ఉంచుకోవాలి. రెండోసారి డోలుదెబ్బకి సెయిమాతాడు చేతిలోకి తీసుకోవాలి. ఇంక మూడోదెబ్బకి ఫైసలా !

అన్నట్టు, దీనికీ కొన్ని నిషిద్ధాలు. మఠాధిపతి (పెగోడా) పుట్టినసంవత్సరం యీ వేడుక జరుగుతున్న సంవత్సరంవూ ఒక్కటే

గాని అయినట్టయినా, ఆ అధిపతి పెగోడా అవతల కూడా పోవలసిందే గాని, కో వెల్లో కాలుపెట్టడానికి వీల్లేదు !

ఈ సెయిమా వ్రతంవల్ల వచ్చేపుణ్యాం చేసినవాళ్ళకి ఒక్కరికే కాకుండా, వారి తల్లిదండ్రులకీ, వారిపైన ఏడుతరాలవారికీ కూడా సంక్రమిస్తుంది. ఇలా యింతమంది భిక్షువులనీ, బ్రాహ్మలనీ వాళ్ళనీ పిలిచి అట్టహాసంగా యిది చెయ్యలేనివాళ్లు, యిదివరకు యీ వ్రతంవల్ల పవిత్రం అయిన స్థలంలో చిన్న గుడిలాంటిది కట్టించినా, ఫలందక్కి, తిన్నగా వైకుంఠానికి వెళ్ళిపోతారు ! అలాంటి గుళ్ళలో బ్రాహ్మలు విగ్రహాలు ప్రతిష్ఠాపనచేసి "యిది బుద్ధుడు వెలిసిన చోటు" అని పవిత్రీకృతంచేస్తే, భిక్షువులు దానిమీద పవిత్రోదకాలు జల్లి "సాధు !" అంటారు (తథాస్తుకి వొచ్చిన ప్రారబ్ధం !).

# 13. మాఘమాసం

కాంబోడియాలో మాఘమాసం పండుగులకి పెట్టిందిపేరు. మాఘపౌర్ణమినాడు బుద్ధుడు తన శిష్యగణాన్ని పిలిపించి, ఓ పెద్ద సమావేశం ఏర్పాటుచేసి, "అబ్బాయిలూ, ఇంక మూణ్ణెల్లనాటికి నేను భౌతికదేహం చాలించి, నిర్వాణం పొందబోతున్నాను; కాబట్టి జాగర్తగా మెసులుకోండేం" అని ఆదేశించాట్ట, మరి! ప్రతీ పెగోడాలోనూ మాఘపౌర్ణమినాటి రాత్రి దీని జ్ఞాపకార్థం కొంత తంతు జరుపుతారు విధిగాను. ఇహ సంధ్యచీకటి పడుతుందనగా, బుద్ధభిక్షువులంతా పెగోడాలు చేరుకుంటారు. భక్తకోటి కూడా ముమ్మారు ప్రదక్షిణంచేసి ఆలయం ప్రవేశించి, బుద్ధ విగ్రహానికి ఎదురుగా నివేదనలు ఉంచుతారు; కొవ్వొత్తులూ ఊదొత్తులూ వెలిగిస్తారు. అంతమందీ తమ తమ జాగాల్లో కూచున్నాక, ఓ భిక్షువు బుద్ధప్రవచనాలు ఏకరువు పెడతాడు. ఆ తరవాత భక్తులు తెచ్చిన వొస్తువులు బుద్ధత్రయానికి (బుద్ధుడూ,

బౌద్ధధర్మంవూ, భిక్షువులూ — యీ మూడింటినీ సముచ్చయంగా బుద్ధత్రయం అంటారు) నైవేద్యం పెడతారు.

ఆదయిన వెంటనే యీ భిక్షువులు యిద్దరేసి చొప్పున, యీ నైవేద్యాలకి ఎదురుగా కూర్చుంటారు. బుద్ధస్తవం(లాంటుంది) పనస చదివినట్టు చదువుతారు. మొట్టమొదటి ఆవృత్తం అవగానే యీ యిద్దర్లోనూ ఒకడు బుద్ధభగవానుడి జీవితచరిత్రనంతా సవ్యాఖ్యగా చెబుతాడు. తరవాత మళ్ళీ 'పనస!' ముక్కలు వొచ్చినట్టాయినా, భక్తులుకూడా పనస చెప్పొచ్చు. అయితే మొదటి ఆవృత్తం భిక్షువులే చెప్పాలి. కొన్ని కొన్ని ప్రదేశాల్లో యిది అర్ధరాత్రితో అంతంఅయిపోతుంది. కాని సాధారణంగా తెల్లవార్లూ జరుగుతుంది యీ తంతు?

కోటలోకూడా యిదే మాదిరి తంతు జరుగుతుంది కాని, దాని ధర్మంవా అని మహావేగిరం ముగించేస్తారు. రాజుగారు ఓ రెండూ, వారి తల్లి మరో రెండూ తేనెపట్టు కొవ్వుతో చేసిన కొవ్వొత్తులు నాలుగు పెగోడాలకీ పంపుతారు. ఈ కొవ్వొత్తులు ఒక్కొక్కటీ మూరెడు పొడుగూ, అరపౌను బరువూ ఉండాలి.

ఇది యిలా ఉండగా "మాసరాజు" పండుగని ఇంకోటి యీ నెలలోనే చేస్తారు; అంటే మాఘమాసానికి ఓరాజూ, వాడి పేరిట ఓ పండుగానూ అన్నమాట. వీడు అసలు రాజుమాత్రం కాడు. ఓ బ్రాహ్మణ్ణి ఆవేళకి రాజుని చేస్తారు. దేశమంతటా పండిన వరి, కంకులపాళంగా తీసుకువొచ్చి అయిదు కుప్పలుపోస్తారు. వారం రోజులపాటు రాచకుటుంబంలోవాళ్ళూ, మంత్రులూ, ఉన్నతోద్యోగులూ అంతా, చిత్రంగా నక్షత్రాలూ నాగు (పాము)ల బొమ్మలూ వాటితో డాబుగా అలంకరించిన బళ్లు యెక్కి ఊరేగింపులాగ వొస్తారు, యీ కుప్పలున్న చోటికి.

మాఘ శుద్ధ 14 చతుర్దశినాడు ఓబ్రాహ్మణ్ణి తీసుకువచ్చి "మాఘరాజు"ని చేస్తారు. ఈరాజుని కోటనుంచి బయలుదేరదీసి, పెద్దఊరేగింపూ, సంబరంతో తీసుకువొస్తారు. ఈ సంబరంలో

మరొక రెండు పెద్ద మైనపుబొమ్మ లుంటాయి, ఒకటి మొగబొమ్మా, రెండోది ఆడదిన్నీ; మొగబొమ్మ చేతిలో ఓదాంట్లో కొడవలీ, మరోదాంట్లో దివిటీన్నీ; ఆడబొమ్మ చంకని ఓబుట్టా, దాన్నిండా అన్నమున్నూ. వీటికి తోడుగా మరో రెండుబొమ్మలు – ఒకటి వీళ్ల కొడుకూ, రెండోది కూతురూనూ. ఈ సంబరంలో మరుగుజ్జు వాళ్లనికూడా ప్రత్యేకించి తీసుకువచ్చి ఊరేగిస్తారు. మాఘురాజుకి అయితే గజారోహణ యోగంవే! సంబరంలో అధమం రెండు వొందలమంది ఉంటారు. బాజాలు వాగుతాయి. బ్రాహ్మలు శంఖాలు పూరిస్తారు. విశేషం ఏంవిటో తెలియదుగాని, ఆవేళ సంబరంలో ప్రతీవాడూ కొంకెకర్రలు చేతబుచ్చుకుంటారు.

వీళ్లంతా కలిసి ఊరేగింపుగా వొచ్చి, యీ ధాన్యంకుప్ప లున్న చోట ముమ్మారు ప్రదక్షిణంచేస్తారు. దానితరవాత కుప్పలకి దక్షిణంగా యీ మైనపుబొమ్మ లుంచుతారు. అప్పట్నుంచీ ఆ జాగా అంతా – పాపపరిహారం అయిపోయి – పవిత్రం అయిందన్న మాట. మళ్లీ మాఘురాజుగారిని ఏనుగమీద కూచోబెట్టి, ఆ జాగాకి మూడు ప్రదక్షిణాలు చేయించి, ఊరేగింపుతో వారింటికి సాగ నంపేస్తారు.

తరవాత మూడోనాడు మాఘురాజుగారు యీ మైనపు బొమ్మల్ని దహనం చేస్తాడు. వాటితోపాటు ధాన్యపుకుప్పలకీ అగ్గి ముట్టిస్తాడు. అయితే వెంటనే నీళ్లుకూడా జల్లడంమూలాన్ని ధాన్యం పెటపెటపేలి పేలాలయి ఊరుకుంటాయి. ఆ పేలాలు ప్రసాదం అని ఉన్నతోద్యోగస్థులదగ్గిర్నుంచి పాలికాపులవరకూ అందరికీ పంచిపెడతారు; మాఘురాజుగారి ధాన్యపుగాదెలో కూడా యీ ప్రసాదం ఉంచుతారు. ఆ బ్రాహ్మడి రాచరికం ఆ సాయిం త్రంతో సరి!

ఈ మాఘంలోనే బుద్ధభిక్షువులు, బౌద్ధదేవాలయాల అవ తల ప్రాయశ్చిత్తకర్మ చేసుకుంటారు కొన్నాళ్లపాటు. ఈ రోజుల్లో ముఖ్యంగా వీళ్లు పాటించవలసింది ఏవిఁటీఅంటే మూగనోము

(మౌనవ్రతం అనబోయి తెలుగులో అన్నాను!). రాత్రి తెల్లవార్లూ పెదిమ కదపడానికి వీల్లేదు, చీకటిపడింది మొదలుకునిన్నీ. అంతే కాకుండా అడుగులో అడుగు వేసుకొంటూ తిరగాలి. ఇలా తిరిగి నప్పుడు ముందు అడుగు వేసిన కాలిమడమకి రెండో కాలి బొటన వేలు తగలాలి, ప్రతీ అడుగడుక్కీనీ. మధ్యలో ఎక్కడ తప్పినా పునరారంభం! ఇలా అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా తిరగాలి రాత్రి అంతాను. ఈ మోస్తరుగా ప్రాయశ్చిత్త కర్మ చేసుకుంటే మనసా, వాచా, కర్మణా — తెలిసీ తెలియకా — చేసిన పాపాలన్నీ తుడుచుకుపోయి నిర్వాణం లభిస్తుందని ఓ నమ్మకం!

తాంత్రిక ఫాల్గుణం!

ఫాల్గుణమాసపు కడాపటి రోజుల్లో కోటలో కొంత తాంత్రిక చర్య జరుగుతుంది.

అయిదు చిన్న చిన్న కట్టడాలు తయారుచేసి బాగా చక్కగా అలంకరిస్తారు. రాచ పురోహితులు ఏవో మంత్రాలూ, తంత్రాలూ చదువుతారు. తరవాత నాలుగింటిని కోట ఆవరణకి వెలుపలిభాగాన్నీ, అయిదోది కోటలో సింహాసనంఉన్న జాగా లోనూ ఉంచుతారు. దర్భలతో చేసిన తాడు ఒకటి తీసుకువచ్చి కోటచుట్టూ కడతారు, మంత్రాలు చదువుతూను. దక్షిణద్వారం నుంచి ఆరంభించి తూర్పుదిక్కుగా ఓ కోరా నూలుతాడు చుట్టి, దాని రెండోకొన సింహాసనం ఉన్న హాల్లోకి వొచ్చేటట్లు చుడతారు. అక్కడ విజయదీపికకూడా ఉంటుంది. ఈ దీపికని ప్రధాన బుద్ధభిక్షువు సమక్షంలో రాజుగారు స్వయంగా వెలిగించాలి (తుమ్ము అపశకునంమాత్రం కాదు!). ఇలా వెలిగించిన యీ దివ్వె కార్యక్రమం అంతంఅయ్యేవరకూ వెలుగుతూ ఉండవలసిందే కాని, మధ్యలో ఆరిపోవడానికి వీల్లేదు. ఈ తంత్రాంగానికి పంచక్షేత్ర విగ్రహాలుకూడా తీసుకువొచ్చి, సింహాసనం ఉన్న కొలువుకూటంలో పెడతారు.

వీటన్నిటితోపాటు గమనించవలసింది ఓ ముసిలి మనిషి! గాథల ప్రకారం, ఒకానొకప్పుడు యీ మనిషిదగ్గర అద్భుతం అయిన దోసకాయలు ఉండేవిట. వాటి శక్తులకి ఆశ్చర్యపోయి రాజుగారు యీ ముసలాడికి ఓ బల్లెం యిచ్చేరుట, దొంగలు ఎవ్వరూ కాజెయ్యకుండా యీ దోసకాయలు రక్షించుకోడానికి. అయితే వీడు జాగర్తగా కాపలాకాస్తున్నాడో లేదో అని అనుమానంతగిలి, రాజుగారు ఓరాత్రప్పుడు చప్పుడుగాకుండా బయలుదేరేరు, తనిఖీకి! దొంగఅనుకుని బల్లెం విసిరి రాజుగారిని చంపేసి, సింహాసనం ఎక్కేసేడు ముసలాడు! అదీగాథ. ఇప్పుడీ ముసలాడు నాయకుడన్నా.

ఈ తాంత్రిక ఫాల్గుణానికే "మాంత్రికదండా"లని చేస్తారు. వీటిని చెరుకాకులు జడలా అల్లి చేస్తారు; వీటిమీద బీజాక్షరా లుంటాయి. ఈ దండాలు కొన్ని వందలు కడతారు; పిలిచినవా ళ్ళందరికీ తలొకటీ యివ్వాలిమరి. దీనితోపాటు కోరానూలు కూడా యిస్తారు; యీ నూలుకి అయిదు కొబ్బరాకు ముక్కలు కట్టి ఉంటాయి. ఈ నూలు, జంఝంవేసుకున్నట్టు ఎడమభుజంపైనుంచి కుడిచేతి కిందుగా వేసుకోవాలి. ఈ రెండూ – మాంత్రికదండం, జంఝప్పోచా – ముఖ్యంగా ప్రత్యేకించీ ఈ తాంత్రిక ఫాల్గుణానికే వాడతారు. బెత్తెడే వెడల్పున్న పాగాలుకూడా (తలచుట్టూ సున్నాలా చుట్టుకుంటారు) వాడతారుకాని, ఈ పాగాలు ప్రతీదానికీ వాడతారు.

ఫాల్గుణ బహుళ 15 అమావాస్య ఉదయాన్నే రాజపురోహితులు శంఖాలు పూరిస్తూ ఉంటే, పవిత్రస్నానం ఆచరిస్తారు. రాజుగారు విజయదీపిక ఆర్పేస్తారు. చిట్టచివరన ఓ ముసలి బుద్ధ భిక్షువు వొచ్చి కోట ఆవరణలోనూ, కోటలో సింహాసనం అదీ ఉన్నచోటా పవిత్రోదకాలు ప్రోక్షిస్తాడు. ఇహ ఏపీడా ఉండదన్న మాట!



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AAL02259 | Date | 8/10/21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CP, 4, 6, 52, 54, 119 | | |
| Missing Pages | NO | | |
| Prepared | chalakshmi | Scanned | Sireesha |
| BOOK SIZE | H 8.0 W 5.3 | Pages | 124 |

